శ్రీమతే రామానుజాయ నమః



# స్తుతిమణిమంజరి

( నిత్యం అనుసంధించుకొనదగిన స్తోత్రాల సంపుటి )

సంకలనం

**న్యాయవేదాంత విద్వాన్**

**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారు**

**ఉ.వే. మహా విద్వాన్**

**శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి**

**116వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక-2014**

# స్తుతిమణిమంజరి

## సంకలనం - శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు

ప్రథమముద్రణ : ఏప్రియల్, 2014

ప్రతులు : 500

ఆవిష్కరణ సందర్భం : శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవము
మేషమాసం – జ్యేష్ఠ

తేది : 19–4–2014

ముఖచిత్రం : శ్రీరంగనాచ్చియార్, నమ్బెరుమాళ్ (శ్రీరంగం)

**ఈగ్రంథం ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి 116వ తిరునక్షత్రోత్సవ సందర్భంలో వారి పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారి దివ్యస్మృతిగా ముద్రింపబడింది.**

**ప్రతులకు**

**1. ఈ.ఏ. శింగరాచార్యులు**
18–3–58/7, శాంతినగర్, కె.టి. రోడ్.
తిరుపతి–517 507
ఫోన్ : 09885003420

డి.టి.పి. : యస్. చంద్రశేఖర్, తిరుపతి

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి



# నివేదన

**భారద్వాజకులాబ్ధికౌస్తుభమణిం శ్రీశింగరార్యాత్మజం**
**తద్వంశోద్భవ రామసోదరగురోః పాదారవిందాశ్రయమ్ ।**
**ఆత్రేయాన్వయగోపకృష్ణగురురాట్ ప్రాప్తాగమాంతద్వయం**
**సేవే సద్గుణశేవధిం గురువరం శ్రీరంగరామానుజమ్ ॥**

1999వ సంవత్సరంలో అస్మత్పితృపాదులు **ఉ.వే. మహావిద్వాన్ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి** శతాబ్దపూర్తి మహోత్సవాలు, వారు నివసించిన అంతర్వేదిపాలెంగ్రామంలో అయిదు దినాలపాటు ఆత్మీయుల, బంధువుల, శిష్య ప్రశిష్యుల సహాయసహకారాలతో, పెద్దల మంగళాశాసనాలతో వైభవంగా జరిగాయి. మరుసటి సంవత్సరంనుండి 2007వ సంవత్సరంవరకు ప్రతి ఏడు శ్రీమాన్ పితృపాదుల తిరునక్షత్రంనాడు ఉభయవేదాంతపండితసభ, విశిష్ట పండిత సంమానకార్యక్రమం నిర్వహింపబడ్డాయి. 2008వ సంవత్సరంనుండి ఆ కార్యక్రమ పరిధి విస్తరించింది. మూడు దినాలపాటు పండితసభలు, విశిష్ట పండిత సంమానకార్యక్రమం జరుపబడగా, గత సంవత్సరంలో (2013 సంవత్సరంలో) పండితసభలు అయిదు దినాలపాటు నిర్వహింపబడి, ఇద్దఱు మహనీయులకు విశిష్టపండిత సత్కారసమర్పణం చేయబడింది. ఈ కార్యక్రమాలన్నీ నిర్విఘ్నంగా జరగడానికి భగవద్భాగవతాచార్య కటాక్షమే నిదానం. శతాబ్దిమహోత్సవాలనుండి ప్రతిఏడు పితృపాదుల తిరునక్షత్రోత్సవ చిహ్నంగా సద్గ్రంథప్రకాశనంకూడా కార్యక్రమంలో భాగంగా చేయబడుతున్నది.

ఇదే రీతిలో, ఈ ఏడుకూడా పితృపాదుల తిరునక్షత్రోత్సవసందర్భంగా పండిత సభాకార్యక్రమం, పండితసంమాన కార్యక్రమం ఏప్రియల్ 19వ తేదీనుండి 21వ తేదీవరకు నరసాపురంలో మూడు దినాల పాటు నిర్వహింపబడుతున్నాయి. ఈ సందర్భంలో **"స్తుతిమణిమంజరి"** అనే ఒక చిన్న గ్రంథం తిరునక్షత్రమహోత్సవ చిహ్నికగా ముద్రింపబడుతున్నది. ఈ గ్రంథంలో ప్రపన్నులు నిత్యం అనుసంధించుకో దగిన కొన్ని చిన్న చిన్న స్తోత్రాలు తాత్పర్యసహితంగా అందివ్వబడుతున్నాయి. ఇవి అన్నీ ఆచార్య రుచి పరిగృహీతాలు.

తిరుప్పావై ప్రబంధంలోని ఆఱవ పాశురంలో గల **"వెళ్ళత్తరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై ఉళ్ళత్తు క్కొణ్డు మునివర్కళుమ్ యోగికళుమ్ మెళ్ళ ఎళున్దు అరి ఎన్ఱ పేరరవమ్**

**ఉళ్ళమ్ పుకున్దు కుళిర్న్దు"** (తెల్లని ఆదిశేషునిపై తూగే జగత్కారణభూతుని మనస్సులో నిలుపుకొని మునులు, యోగులో ప్రాతఃకాలంలో మెల్లగా లేచి, **"హరిః"** అని చేసిన హరినామానుసంధానం పెద్ద శబ్దమై, మనస్సు లోపల ప్రవేశించి చల్లబఱచింది) అనే సూక్తివల్ల ప్రాతఃకాలంలో లేవగానే హరినామస్మరణను చేయాలని తెలుస్తున్నది. ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానిస్తూ " **'అరి' ఎన్నై యావదు- హరిర్హరతి పాపాని - ఎన్గిఱ పడియే భగవదనుభవవిరోధికళై పోక్కి యరుళవేణుమెన్నై"** (**"అరి"** అని అనడంలో భావమేమంటే - **"హరిర్హరతి పాపాని"** - అనే రీతిలో భగవదనుభవ విరోధులను పోగొట్టి కాపాడాలి - అని భావం.) అని అన్నారు. దీనివల్ల హర్యష్టకమనే స్తోత్రం ఉదయం లేవగానే అనుసంధించడం శిష్టాచారం- అని స్ఫుటపడుతున్నది. అదే విధంగా పెరియా*ళ్వా*ర్ తిరుమొ*ళి*లోని **"ఎల్లియమ్బోదు ఇరుఞ్జిఱై వణ్డు ఎమ్బెరుమాన్ గుణమ్ పాడి"** (4-8-8) (సాయంసమయంలో అందమైన, విశాలమైన రెక్కలను కల తుమ్మెద భగవానుని గుణాలను కీర్తించి) అనే సూక్తిలో సాయంసమయంలో శ్రీరంగంలోని ఉద్యానవనాలలోని అందమైన రెక్కలు కల తుమ్మెదలు భగవానుని దివ్యగుణాలను గానం చేస్తున్నాయి - అని తెలుపబడింది. తిర్యక్కులైన పక్షులుకూడా సాయంకాల సమయంలో భగవన్నామాను సంధానం చేస్తున్నందున, మానవులైన మనంకూడా త్రిసంధ్యలలో ఆవిధంగా భగవన్నామస్మరణను చేయడం కర్తవ్యమనే విషయం కింపునర్న్యాయసిద్ధం కదా! ఈ విధంగా త్రిసంధ్యలలోను భగవన్నామానుసంధానం ప్రపన్నునకు కర్తవ్యమని, భగవద్గుణాను భవంలో భాగమని, ఇది శిష్టాచారక్రమమని విశదమవుతున్నది. ఈ నామస్మరణ దివ్యజ్ఞానసంపన్నులైన మహర్షులు, పూర్వాచార్యులు మనకు అందించిన మధురస్తుతుల ద్వారా చేయడం మనకు సులభం, భగవదనుగ్రహాన్ని తప్పక కల్గించే ఉపాయం. మనం స్వయంగా కొత్తగా కొన్ని స్తోత్రాలను రచించి స్తుతించడం కంటే, విజ్ఞులైన పెద్దలు మనకు అందించిన ఆచార్యరుచిపరిగృహీతాలైన స్తుతులను అనుసంధించడం ఉచితం, అవశ్యఫలప్రదం కదా! హర్యష్టకం - తిరువాయ్‌మొ*ళి*(3-5-3) పాశురం ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో, దేవరాజాష్టకం - తిరువాయ్‌మొ*ళి* (8-3-11) పాశుర వ్యాఖ్యలో, అష్టశ్లోకి - తిరువాయ్‌మొ*ళి* (1-6-11) పాశురవ్యాఖ్య అరుంబదంలో ప్రమాణీకరింపబడ్డాయి. ఇదేవిధంగా చతుఃశ్లోకి, స్తోత్రరత్నం, శ్రీరంగరాజస్తవం, శ్రీగుణరత్నకోశం, పంచస్తవి, ముకుందమాల, దయాశతకంవంటి పలు స్తుతులు దివ్యప్రబంధవ్యాఖ్యలలో పూర్వాచార్యులు ఉదాహరించడం వాటి పూర్వాచార్యరుచిపరిగృహీతత్వాన్ని నిరూపిస్తున్నది.



ఇక్కడ ప్రస్తావించవలసిన విషయం ఒకటి ఉన్నది. పంచాయుధస్తోత్రం అనే స్తుతి భగవానుని ఐదు ముఖ్యమైన ఆయుధాలను కీర్తిస్తున్నది. ఇది ఇంతకాలంగా ముద్రింపబడిన స్తోత్ర గ్రంథాలలో అజ్ఞాత కర్తృకంగానే కనిపిస్తున్నది. వావిళ్ళవారు ముద్రించిన స్తోత్ర గ్రంథంలో కూడా ఈవిధంగానే చూపబడింది. శ్రీవైష్ణవసంప్రదాయంలో ఆ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులనుగ్రహించిన స్తోత్రాలే నిత్యానుసంధేయాలుగా విలసిల్లుతున్నాయి. ఉదయం నిద్రలేచిన వెంటనే పెద్దలు అనుసంధించుకునే స్తోత్రాలలో ఈ పంచాయుధ స్తోత్రం ఒకటి. శ్లోకద్వయం, శ్లోకత్రయం, పరమార్థ స్తుతి, పరత్వాదిపంచకం అనే స్తుతుల తర్వాత ఈ స్తుతి అనుసంధించకొనబడుతున్నందున బహుశః నడాదూర్‌అమ్మాళ్ (వాత్సవరదగురువు) వంటి శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులెవరో దీనిని రచించియుండి యుండాలి - అనేది తథ్యం. ఈ స్తుతిని అన్యసంప్రదాయస్థుల గ్రంథాలలో ప్రమాణీకరింపబడకపోవడం కూడా గమనించదగినది. ఈమధ్యకాలంలో ఈ స్తుతిని శ్రీశంకరాచార్య కృతంగా కొందరు ప్రచారం చేస్తున్నా, దానికి ఆధారం ఏదీ కనిపించకపోవడం కూడా గమనార్హం.

ఈ రీతిలోని నిత్యానుసంధేయాలైన కొన్ని చిన్న చిన్న స్తోత్రాలు **"స్తుతిమణి మంజరి"** అనే ఈ లఘుగ్రంథంలో ముద్రింపబడుతున్నాయి. ఈ గ్రంథం దాసుని పితామహపాదులు **ఉవే శ్రీమాన్ ఈయుణ్ణి రంగరామానుజాచార్యస్వామివారి దివ్యస్మృతిగా** ముద్రింపబడుతున్నది. **"పిత్రే బ్రహ్మోపదేష్ట్రే చ"** అనే రీతిలో తమ పితృపాదుల విషయంలో సమర్పించే ఈ వాచికకైంకర్యం దాసుని పితృపాదులైన శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి ముఖోల్లాసానికి తప్పక కారణం కాగలదని దాసుని నమ్మకం.

పితామహపాదులు శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారు నిష్కల్మషమైన స్వభావాన్ని, వర్తనాన్ని కలవారుగా ప్రసిద్ధి చెందారు. చిన్నతనం నుండి వారి విశిష్ట వ్యక్తిత్వాన్ని నిరూపించే గుణసంపత్తిని ప్రత్యేకించి వారి ఋజుత్వాన్ని, శౌచాన్ని చూచి అందఱు ప్రశంసించేవారట. అయిదుగురు సహోదరులలో వీరు జ్యేష్ఠులు. తమ వంశానికి చెందిన పెద్దలు శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారిని ఆశ్రయించారు. ఈ రామానుజాచార్యస్వామివారు నరసాపురంలో శ్రీఆదికేశవ ఎమ్బెరమానార్ స్వామివార్ల దివ్యాలయాన్ని నిర్మింపజేసిన వారైన శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్య స్వామివారికి పౌత్రులు. పితామహులు, పంచకావ్యాలను చదివిన తరువాత, తమకు వరుసకు బావగారైన **ఉ.వే. మహా విద్వాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారి** సన్నిధిలో

సాంప్రదాయిక రహస్యగ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, శ్రీరామానుజ సిద్ధాంత మర్మాలను పరిపూర్ణంగా గ్రహించారు. భగవద్విషయాన్నికూడా వారివద్దనే అధికరించారు. వారు నరసాపురంలో నిర్వహించే భగవద్రామానుజుల తిరునక్షత్రోత్సవాలలో **"రామస్య దక్షిణో బాహుః"** అనే రీతిలో కుడి భుజంగా నిలచి, పలు రీతులలో వారికి ప్రోత్సాహాన్ని, సహకారాన్ని అందించారు. **వీరి తండ్రిగారు శ్రీమాన్ శేషశింగరా చార్య స్వామివారు (దాసుని ప్రపితామహులు)** శ్రీరంగయాత్ర చేసి వచ్చిన తరువాత వీరు జన్మించినందున వీరికి **"రంగరామానుజా చార్యుల"**నే పేరును పెట్టారట. లౌకిక వ్యవహారాల పరిష్కారాలలోకూడా వీరు చాలా సమర్థులుగా పేరు పొందారు. వీరికి సంబంధించిన ఎక్కువ విశేషాలు లభించడం లేదు. తమపై తమ పితృపాదుల వ్యక్తిత్వ ప్రభావం పూర్తిగా ఉన్నదని దాసుని పితృపాదులు పదే పదే అనేవారు. వీరు 32 సం॥ల చాలా చిన్నవయస్సులో పరీధావి సంవత్సరం ఆశ్వయుజమాసం ద్వాదశీతిథిలో ఆచార్యసన్నిధిని చేరారు.

ఈ నిత్యానుసంధేయ స్తోత్రాల సంపుటి రూపమైన చిఱుగ్రంథం ప్రపన్నులకు ఆదరణీయం కాగలదని భావిస్తున్నాను. ఇదేరీతిలో త్వరలో మఱికొన్ని సాంప్రదాయిక స్తుతులు తాత్పర్యంలో ప్రచురించే అవకాశం భగవద్భాగవతాచార్య మంగళాశాసనం వల్ల కల్గుతుందని ఆశిస్తూ. స్వస్తి,

**భారద్వాజకులాంభోధికౌస్తుభాయ మహీయసే ।**
**శ్రీమతే రంగరామానుజాచార్యాయాస్తు మంగళమ్ ॥**

**శ్రీరంగపూర్వరామానుజార్యనామక పితామహస్మృత్యై ।**
**స్తుతిమణిమంజరినామ్నీ కలితేయం స్యాత్ ప్రపన్నగళభూషా ॥**

నరసాపురం — ఇట్లు నివేదించు, భాగవతవిధేయుడు
26-03-2014 — **ఈ. రంగాచార్యులు**



# విషయసూచిక

# నిత్యానుసంధేయశ్లోకాలు

**1) శ్రీరంగమంగళమణిం కరుణానివాసం**
**శ్రీవేంకటాద్రిశిఖరాలయ కాలమేఘమ్ ।**
**శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతమ్**
**శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్ ॥**

కరుణకు నిలయుడు, శ్రీరంగంలోని మంగళకరమైన మణివలె విలసిల్లేవాడు, శ్రీవేంకటాచలశిఖరంలోని కాలమేఘంవంటివాడు, శ్రీహస్తిశైలశిఖరంలో (కాంచీపురంలో) గొప్పగా ప్రకాశించే పారిజాతవృక్షంవంటివాడు, యాదవాద్రి అనబడే తిరునారాయణపురంలో దీపంవంటివాడైన శ్రియఃపతిని శిరసా నమస్కరిస్తున్నాను. (ఇందులో, శ్రీవైష్ణవసంప్రదాయంలో ముఖ్యమైన దివ్యక్షేత్రాలుగా పరిగణింపబడే శ్రీరంగం, తిరుమల, కంచి, మేల్కోటె (తిరునారాయణపురం) అనే నాల్గు ప్రస్తావింపబడ్డాయి).

**2) పపాపరిమళోల్లాసవాసితాధరపల్లవమ్ ।**
**ముఖం వరదరాజస్య ముగ్ధస్మిత ముపాస్మహే ॥**

**"వప"** యొక్క (అశ్వమేధయాగంలో హోమం చేయబడే అశ్వం శరీరంలోని ఒక భాగం) పరిమళం వెలువడే, చిగురువంటి అధరాన్ని కల్గిన, మధురమైన మందహాసాన్ని కల్గిన వరదరాజస్వామి ముఖాన్ని ఉపాసిస్తున్నాను.

**3) వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరిః స్వయమ్ ।**
**వరదః సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే ॥**

వేగవతీ ("వేగై") నది ఉత్తరతీరంలో వెలసిన పుణ్యకోటివిమానంలో, భక్తుల కష్టాలను తీర్చే వరదరాజస్వామి ఈనాటికి స్వయంగా ప్రాణులందరికీ దర్శనమిస్తున్నాడు.

**4) వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥**

వేంకటాచలంతో సమానమైన చోటు ఈ లోకంలో వేఱొకటి ఎక్కడా లేదు. వేంకటేశ్వరునితో సమానమైన దైవం ఇంకొకటి గతంలో కాని, ఇప్పుడు గాని భవిష్యత్తులో గాని లేదు.



**5) మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।**
**స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥**

ఆశ్చర్యాన్ని కల్గించే లీలలను చేసే భగవానుడు గొప్ప ఆనందాన్ని పొందించే, ఉత్తమమైన వైకుంఠాన్ని సైతం వదలిపెట్టి, వేంకటాద్రిపై స్వామిపుష్కరిణీతీరంలో లక్ష్మీదేవితోపాటు కలసి ఆనందిస్తున్నాడు.

**6) శ్రీవేంకటాద్రినిలయః కమలాకాముకః పుమాన్ ।**
**అభంగురవిభూతి ర్నః తరంగయతు మంగళమ్ ॥**

శ్రీవేంకటాచలాన్ని నివాసంగా కలవాడు, పద్మావతీప్రియుడు, నిత్యవిభూతిని కలవాడైన పరమపురుషుడు మనకు మంగళపరంపరలను నిత్యంగా విస్తరింపజేయాలి.

**7) ఆనందనిలయే శేషతల్పే వేంకటభూధరే ।**
**క్రీడంతం రమయా సార్ధం శ్రీనివాస మహం భజే ॥**

పడుకగా అమరి ఉండే ఆదిశేషుని రూపమైన శ్రీవేంకటాచలంపై ఆనందనిలయవిమానంలో లక్ష్మీదేవితో పాటు కలసి ఆనందించే శ్రీనివాసుని నేను భజిస్తున్నాను.

**8) నమస్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీమ్ ।**
**ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే ॥**

అవలీలగా భూమిని ఉద్ధరించే అద్వితీయుడైన ఆ వరాహస్వామికి నమస్కారం. ఆ గొప్పరూపాన్ని కల వరాహస్వామి గిట్టల మధ్యలో చిక్కిన మేరుపర్వతం కణకణలాడే చిన్న నిప్పురవ్వగా తోచింది.

**9) తస్య యజ్ఞవరాహస్య విష్ణో రమితతేజసః ।**
**ప్రణామం యేఽపి కుర్వంతి తేషామపి నమో నమః ॥**

గొప్ప తేజస్సును కలవాడు, విష్ణురూపి అయిన ఆ యజ్ఞవరాహస్వామికి ఎవరు నమస్కరిస్తారో, ఆ మహనీయులకు మాటి మాటికి నమస్కారం.



# హర్యష్టకం

(ఈ స్తుతిని శ్రీనృసింహస్వామిని గూర్చి ప్రహ్లాదుడు చేశాడు. దీనిని ఉదయం, సాయంసంధ్యాసమయాలలో చెప్పుకోవడం మంచిది.)

1. **హరి ర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥**

చెడ్డ మనస్సును కలిగినవారు సైతం మనఃపూర్వకంగా **"హరి"** అనే నామాన్ని స్మరిస్తే వారి పాపాలను ఆ నామం పోగొడుతుంది. అనుకోకుండా తాకినా నిప్పు కూడా దహిస్తుంది కదా.

2. **స గంగా స గయా సేతు స కాశీ స చ పుష్కరమ్ ।
జిహ్వాగ్రే వర్తతే యస్య హరి రిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరి నాలుక చివరిపై హరి అనే రెండు అక్షరాలు ఉంటాయో, అతడే గంగానది. అతడే గయా క్షేత్రం, సేతువు, కాశి, అతడే పుష్కరమనబడే క్షేత్రం.

3. **వారాణస్యాం కురుక్షేత్రే నైమిశారణ్య ఏవ చ ।
యత్ కృతం తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో, అతడు కాశీనగరంలో, కురుక్షేత్రంలో, నైమిశారణ్యంలో పుణ్యకార్యాలను చేసినవాడు అవుతున్నాడు.

4. **పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యాయతనాని చ ।
తాని సర్వాణ్యశేషాణి హరిరిత్యక్షరద్వయమ్ ॥**

భూమిపై ఏ పుణ్యతీర్థాలున్నాయో, దేవాలయాలున్నాయో, అవి అన్నీ హరి అనే రెండక్షరాలతో సమానం.

5. **గవాం కోటి సహస్రాణి హేమకన్యాసహస్రకమ్ ।
దత్తం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో, అతడు వేలాది కోట్ల గోవులను, బంగారాన్ని, వేలాది కన్యలను దానం చేసిన పుణ్యాన్ని పొందుతున్నాడు.



6. **ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదోఽప్యథర్వణః ।
అధీత స్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో, అతడు ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని, సామవేదాన్ని, అధ్వరణ వేదాన్ని అధ్యయనం చేసినవాడు అవుతున్నాడు.

7. **అశ్వమేధైః మహాయజ్ఞైః నరమేధైః తథైవ చ ।
ఇష్టం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడతాయో, అతడు అశ్వమేధ మహాయాగాలను, నరమేధమహాయాగాలను చేసినవాడు అవుతున్నాడు.

8. **ప్రాణప్రయాణపాథేయం సంసారవ్యాధినాశనమ్ ।
దుఃఖాత్యంతపరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్ ॥**

హరి అనే రెండక్షరాలు ప్రాణం పోయే సమయంలో దారిభత్యంవంటివి, సంసారమనే వ్యాధిని నశింపజేసేవి, దుఃఖాలనుండి పూర్తిగా రక్షించేవి.

9. **బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ।
సకృదుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్ ॥**

ఎవరిచేత హరి అనబడే రెండక్షరాలు ఉచ్చరింపబడుతున్నాయో, ఆతడు మోక్షానికి పోవడంకోసం తగిన పరికరాలను సిద్ధం చేసుకొన్నవాడౌతున్నాడు.

10. **హర్యష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
ఆయుష్యం బలమారోగ్యం యశోవృద్ధి శ్రియావహమ్ ॥**

ఎవడు ఈ పవిత్రమైన హర్యష్టకమనే స్తోత్రాన్ని ఉదయ కాలంలో లేచి పఠిస్తున్నాడో, అతడు ఆయుస్సును, బలాన్ని, ఆరోగ్యాన్ని, కీర్తిని, వృద్ధిని సంపదను పొందుతున్నాడు.

11. **ప్రహ్లాదేన కృతం స్తోత్రం దుఃఖసాగరశోషణమ్ ।
యః పఠేత్ స నరో యాతి తద్విష్ణోః పరమం పదమ్ ॥**

దుఃఖమనే సముద్రాన్ని ఎండించేది, ప్రహ్లాదునిచే రచింపబడినది అయిన ఈ స్తోత్రాన్ని ఎవడు పఠిస్తున్నాడో, లేక వింటున్నాడో అతడు పరమపదాన్ని పొందగలడు.

# దేవరాజాష్టకం

(ఈస్తుతిని తిరుక్కచ్చినంబి రచించారు. ఇందులో వరదరాజస్వామిని ఉద్దేశించి శరణాగతి చేయబడింది. దీనిని ఉదయం, సాయంకాలం చెప్పుకోవడం మంచిది.)

### తిరుక్కచ్చినమ్బి తనియన్‌లు

**శ్రీమత్కాంచీమునిం వందే కమలాపతినందనమ్ ।**
**వరదాంఘ్రిసదాసంగ రసాయనపరాయణమ్ ॥**

వరదరాజస్వామి శ్రీచరణాలలో నిరంతరమైన సంగం (భక్తి) అనే రసాయనాన్ని పరాయణంగా కలవారు (వరదరాజస్వామి విషయంలో అచంచలమైన భక్తిని కలవారు), కమలాపతి అనే మహనీయుల కుమారులు అయిన శ్రీ కాంచీపూర్ణముని (తిరుక్కచ్చి నంబి)కి నమస్కరిస్తున్నాను.

**దేవరాజదయాపాత్రం శ్రీకాంచీపూర్ణ ముత్తమమ్ ।**
**రామానుజమునే ర్మాన్యం వందేఽహం సజ్జనాశ్రయమ్ ॥**

శ్రీవరదరాజస్వామి అనుగ్రహానికి పాత్రమైనవారు, చాలా గొప్పవారు, శ్రీరామానుజులకు పూజనీయులు, సత్పురుషులకు ఆశ్రయమైనవారైన కాంచీపూర్ణులను (తిరుక్కచ్చినంబి) నమస్కరిస్తున్నాను.



**నమ స్తే హస్తిశైలేశ ! శ్రీమన్ ! అంబుజలోచన! ।**
**శరణం త్వాం ప్రపన్నోఽస్మి ప్రణతార్తిహరాచ్యుత! ॥**

శ్రీహస్తిగిరినాథా! పెరున్దేవిత్తాయార్‌కు నాథుడైనవాడా ! (లక్ష్మీనాథా!) తామరలవంటి కన్నులను కలవాడా! దాసుల దుఃఖాలను తీర్చేవాడా ! ఆశ్రితులను ఏ నాడూ విడువని అచ్యుతా! నీకు నమస్కారం. నిన్ను శరణు పొందుతున్నాను.

**సమస్తప్రాణి సంతానప్రవీణ ! కరుణోల్బణ !**
**విలసంతు కటాక్షా స్తే మయ్యస్మిన్ జగతాం పతే ॥**

సకలచేతనాలను రక్షించడంలో సమర్థుడవైనవాడా! గొప్ప కరుణను కలవాడా! లోకాలకు అన్నిటికి ప్రభూ! ఈ దాసుని విషయంలో నీ కటాక్షాలను ప్రకాశింపజేయాలి.



**నిందితాచారకరణం నివృత్తం కృత్యకర్మణః ।**
**పాపీయాంస మమర్యాదం పాహి మాం వరద ! ప్రభో ! ॥**

వరదరాజస్వామీ ! శాస్త్రాలలో చేయరాదని నిషేధింపబడ్డ కర్మలు చేసేవాడను, శాస్త్రవిహితాలైన– అంటే– తప్పకుండా చేయాలని విధింపబడ్డ కర్మలను చేయనివాడను, పాపిష్ఠివాడను, మర్యాదను అతిక్రమించినవాడను అయిన నన్ను (దాసుణ్ణి) రక్షించాలి.

**సంసారమరుకాంతార దుర్వ్యాధివ్యాఘ్రభీషణే ।**
**విషయక్షుద్రగుల్మాఢ్యే తృషాపాదపశాలిని ॥**

**పుత్రదారగృహక్షేత్ర మృగతృష్ణాంబుపుష్కలే ।**
**కృత్యాకృత్య వివేకాంధం పరిభ్రాంత మిత స్తతః ॥**

**అజస్రం జాతతృష్ణార్త మవసన్నాంగ మక్షమమ్ ।**
**క్షీణశక్తిబలారోగ్యం కేవలం క్లేశసంశ్రయమ్ ॥**

**సంతప్తం వివిధై ర్దుఖైః దుర్వచై రేవమాదిభిః ।**
**దేవరాజ! దయాసింధో! దేవదేవ! జగత్పతే! ॥**

**త్వదీక్షణసుధా సింధువీచివిక్షేపశీకరైః ।**
**కారుణ్యమారుతానీతైః శీతలై రభిషించ మామ్ ॥**

కరుణాసముద్రా ! వరదరాజస్వామీ ! దేవాధిదేవా ! లోకాలకు పతి అయినవాడా! క్రూరవ్యాధులనే పులులచేత భయంకరమైనది, లౌకికసుఖాలనే క్షుద్రమైన ముళ్ళపొదలతో నిండినది, ఆశలనే మహావృక్షాలతో దట్టమైనది, పుత్రులు, భార్య, ఇల్లు, ఆస్తి– అనే ఎండమావుల నీటితో నిండినది అయిన సంసారం అనే భయంకరారణ్యంలో "ఇది చేయదగినది, ఇది చేయకూడనిది" అనే వివేకాన్ని ఏమాత్రం లేకుండా ఎక్కడెక్కడో తిరిగి తిరిగి అల్లాడి, నిరంతరం విషయతృష్ణార్తుడనై, శరీరం కృశించినవాడనై, అసమర్థుడనై, శక్తి, బలం ఆరోగ్యం – అనే వీటిలో దేనినీ లేనివాడనై, పలు క్లేశాలతో పూర్తిగా తపింపబడ్డవాడనై, చెప్పడానికి వీలు కాని, ఇటువంటి పలు రీతులలోని బాధలతో ఆర్తుడనై ఉండే నన్ను నీ కరుణ అనే వాయువుచేత ప్రేరేపింపబడ్డవి, చల్లనివి అయిన నీ కటాక్షామృత నదీప్రవాహతరంగాలతో అభిషేకించు.



# శ్రీకృష్ణాష్టకమ్

(ఈస్తుతిని ఉదయం నిద్రలేవగానే చెప్పుకోవాలి.)

**1) వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।**
**దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

వసుదేవుని కుమారుడు, కంసుని, చాణూరుడనే మల్లులను వధించిన వాడు, దేవకీదేవికి పరమానందాన్ని కల్గించినవాడు, జగద్గురువు (ప్రకాశించే వాడైన) దేవుడైన శ్రీకృష్ణునకు నమస్కరిస్తున్నాను.

**2) అతసీపుష్పసంకాశం హారనూపురశోభితమ్ ।**
**రత్నకింకణకేయూరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

అగిసెపూవురంగువంటి వర్ణాన్ని కలవాడు, హారాలతో, నూపురాలతో శోభిల్లేవాడు, రత్నాలు పొదిగిన కంకణాలను, కేయూరాలను కలవాడు, జగద్గురువైన శ్రీకృష్ణునకు నమస్కరిస్తున్నాను.

**3) కుటిలాలకసంయుక్తం పూర్ణచంద్రనిభాననమ్ ।**
**విలసత్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

అందమైన ఉంగరాల జుట్టును కలవాడు, పూర్ణచంద్రునివంటి అందమైన ముఖాన్ని కలవాడు, ప్రకాశించే మకరకుండలాలను ధరించిన వాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**4) మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।**
**బర్హిపింఛావచూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

మందారపూల సుగంధంతో కూడినవాడు, అందమైన మందహాసాన్ని కలవాడు, చతుర్భుజుడు, నెమలిపింఛాన్ని శిరస్సుకు ఆభరణంగా కలవాడు, జగద్గురువైన శ్రీకృష్ణునకు నమస్కరిస్తున్నాను.

**5) ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్ ।**
**యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**



బాగా వికసించిన తామరపూల రేకులవంటి కన్నులను కలవాడు, నల్లని మేఘంవంటివాడు, యాదవులలో ప్రముఖుడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**6) రుక్మిణీకేళిసంయుక్తం పీతాంబరసుశోభితమ్ ।**
**అవాప్తతులసీగంధం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

రుక్మిణీదేవితో కలసి ఆనందించేవాడు, పీతాంబరంతో (పసుపు పచ్చని పట్టువస్త్రం) గొప్పగా శోభిల్లే వాడు, తులసీమాల సుగంధాన్ని కలవాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరి స్తున్నాను.

**7) గోపికానాం కుచద్వంద్వకుంకుమాంకితవక్షసమ్ ।**
**శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

తమ వక్షఃస్థలాలలో కుంకుమను అలంకరించుకొన్న గోపికలను ఆలింగనం చేసికొన్నందువల్ల, ఆ కుంకుమతో ముద్రింపబడిన వక్షస్సును కలవాడు, లక్ష్మీ నిలయుడు గొప్ప వీరుడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**8) శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।**
**శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

శ్రీవత్సమనే (తెల్లని) పుట్టుమచ్చను కలవాడు, విశాలమైన వక్షఃస్థలాన్ని కలవాడు, వనమాల – అనే పూమాలికతో విరాజిల్లే వాడు, శంఖచక్రాలను దాల్చిన వాడు, దేవుడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**9) కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।**
**కోటిజన్మకృతం పాపం సద్య ఏవ వినశ్యతి ॥**

పవిత్రమైన శ్రీకృష్ణాష్టకస్తుతిని ప్రాతః కాలంలో నిద్రలేచి పఠించేవానికి అతడు కోటిజన్మలలో చేసిన పాపం వెంటనే నశిస్తుంది.

# పంచాయుధస్తోత్రమ్

(ఈస్తుతిని ఉదయం నిద్రలేవగానే చెప్పుకోవాలి.)

**1) స్ఫురత్సహస్రారశిఖాతితీవ్రం సుదర్శనం భాస్కరకోటితుల్యమ్ ।**
**సురద్విషాం ప్రాణవినాశి విష్ణోః చక్రం సదాహం శరణం ప్రపద్యే ॥**

ప్రకాశించే వేయి ఆకులలోని అగ్నిజ్వాలలతో తీవ్రమైనది, వేయి సూర్యులతో సమానమైన కాంతిని కల్గినది, అసురుల, రాక్షసుల ప్రాణాలను నశింపజేసేది అయిన విష్ణువుయొక్క సుదర్శనమనే చక్రాన్ని శరణు వేడుతున్నాను.

**2) విష్ణోర్ముఖోత్థానిలపూరితస్య యస్య ధ్వనిః దానవదర్పహంతా ।**
**తం పాంచజన్యం శశికోటిశుభ్రం శంఖం సదాహం శరణం ప్రపద్యే ॥**

విష్ణువుయొక్క ముఖంనుండి పుట్టిన గాలిచే పూరింపబడిన ఏ శంఖం యొక్క ధ్వని దానవుల దర్పాన్ని హరిస్తున్నదో, కోటిచంద్రులవలె తెల్లనైన ఆ పాంచజన్యమనే (విష్ణువుయొక్క) శంఖాన్ని శరణు పొందుతున్నాను.

**3) హిరణ్మయీం మేరుసమానసారాం కౌమోదకీం దైత్యకులైకహంత్రీమ్ ।**
**వైకుంఠవామాగ్ర కరాభిమృష్టాం గదాం సదాహం శరణం ప్రపద్యే ॥**

బంగారు రంగును కల్గినది, మేరువుతో సమానమైన శక్తిని కల్గినది, దైత్య సమూహాన్ని నశింపజేయడంలో సాటి లేనిది, వైకుంఠుడనబడే శ్రీమన్నా రాయణుని వామహస్తంచే పట్టుకొనబడేది అయిన కౌమొదకి అనే గదను శరణు వేడుతున్నాను.

**4) రక్షోఽసురాణాం కఠినోగ్రకంఠ చ్ఛేదక్షరత్క్షోణితదిగ్ధధారమ్ ।**
**తం నందకం నామ హరేః ప్రదీప్తం ఖడ్గం సదాహం శరణం ప్రపద్యే ॥**

రాక్షసుల, అసురుల మిక్కిలి కఠినమైన, భయంకరమైన కంఠాలను ఖండించడంచేత వాటినుండి స్రవించే రక్తంతో తడుపబడిన అంచును కల్గినది, మిక్కిలి ప్రకాశించేది అయిన హరియొక్క నందకమనే ఖడ్గాన్ని సదా శరణు పొందు తున్నాను.

**5) యజ్జ్యానినాదశ్రవణాత్ సురాణాం చేతాంసి నిర్ముక్తభయాని సద్యః ।**
**భవంతి దైత్యాశనిబాణవర్షి శార్ఙ్గం సదాహం శరణం ప్రపద్యే ॥**



ఏ వింటినారి శబ్దాన్ని వినడంవల్ల దేవతల మనస్సులు తత్ క్షణం భయం తీరినవిగా అవుతున్నాయో, దైత్యులపై పిడుగులవంటి బాణాలను వర్షించే భగవానుని శార్ఙ్గమనే ఆ ధనుస్సును నిత్యం శరణు పొందుతున్నాను.

**6) ఇమం హరేః పంచమహాయుధానాం స్తవం పఠేద్యోఽనుదినం ప్రభాతే ।**
**సమస్తదుఃఖాని భయాని సద్యః పాపాని నశ్యంతి సుఖాని సంతి ॥**

హరి అనబడే భగవానునియొక్క అయిదు ఆయుధాలకు చెందిన ఈ స్తుతిని ఎవడు ప్రతిదినం ఉదయకాలంలో పఠిస్తాడో, అతని అన్ని దుఃఖాలు, భయాలు వెంటనే తీరిపోతాయి. సుఖాలు కల్గుతాయి.

**7) వనే రణే శత్రుజలాగ్నిమధ్యే యదృచ్ఛయాపత్సు మహాభయేషు ।**
**ఇదం పఠన్ స్తోత్రమనాకులాత్మా సుఖీ భవేత్ తత్కృతసర్వరక్షః ॥**

వనంలో, రణభూమిలో, శత్రువుల మధ్యలో, నీటిలో, నిప్పు మధ్యలో అనుకోకుండా వచ్చిన ఆపదలలో, మహాభయాలలో ఈ స్తోత్రాన్ని పఠించే వాడు, ఆ పంచాయుధాలచే రక్షింపబడినవాడై ఏవిధమైన భయాన్ని లేని వాడుగా, సుఖాన్ని పొందినవాడు కాగలడు.

**8) సశంఖచక్రం సగదాసిశార్ఙ్గం పీతాంబరం కౌస్తుభవత్సచిహ్నమ్ ।**
**శ్రియాసమేతోజ్జ్వలశోభితాంగం విష్ణుం సదాహం శరణం ప్రపద్యే ॥**

శంఖచక్రాలతో, గదతో, ఖడ్గంతో, శార్ఙ్గమనే వింటితో కూడినవాడు, పీతాంబ రాన్ని ధరించినవాడు, కౌస్తుభమనే రత్నాన్ని, శ్రీవత్సమనే (తెల్లని) పుట్టు మచ్చను కలవాడు, లక్ష్మితో కూడినవాడై అందువల్ల గొప్పగా ప్రకాశించే దివ్యాంగాలను కలవాడు అయిన విష్ణువును నేను నిత్యం శరణు పొందుతున్నాను.

**9) జలే రక్షతు వారాహః స్థలే రక్షతు వామనః ।**
**అటవ్యాం నారసింహశ్చ సర్వతః పాతు కేశవః ॥**

నీటిలో వరాహస్వామి, నేలపై వామనుడు, అరణ్యంలో నరసింహ మూర్తి, అంతటా కేశవుడు మనలను రక్షించాలి.

నడాదూర్ అమ్మాళ్ అనుగ్రహించిన

# పరమార్థస్తుతి (అర్చిరాది గతిచింతనమ్)

( ఈస్తుతిని నిద్రలేవగానే చెప్పుకోవడం పెద్దల ఆచారం.)

**1) సత్సంగాత్ భవనిస్పృహో గురుముఖాత్ శ్రీశం ప్రపద్యాత్మవాన్ ।**
**ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణకర్మాంతరః ॥**
**న్యాసాదేవ నిరంకుశేశ్వరదయా నిర్లూనమాయాన్వయో ।**
**హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారాత్ బహిర్నిర్గతః ॥**

మానవుడు సత్పురుషుల సహవాసంవల్ల సంసారంపట్ల ఆసక్తి లేని వాడై ముముక్షువు అవుతాడు. అపుడు సదాచార్యునిద్వారా శ్రియఃపతిని శరణాగతి చేసి సత్తను కల్గినవాడవుతాడు. ఆ పిమ్మట ప్రారబ్ధకర్మఫలాన్ని దేహావసానపర్యంతం అనుభవించి, సంచిత – ఆగామికర్మల ఫలాన్ని భగవదనుగ్రహంవల్ల పోగొట్టు కొంటాడు. తాను చేసిన ప్రపత్తివల్ల సంతోషించిన, నిరంకుశస్వతంత్రుడైన భగవానుని నిర్హేతుకకృపాఫలంగా మాయ అనబడే ప్రకృతితో సంబంధాన్ని పూర్తిగా లేకుండా చేసికొన్నవాడై, తన హృదయంలో నిరంతరం వేంచేసి ఉండే జనార్దనుని అనుగ్రహం వల్ల సుషుమ్న అనబడే మధ్యధమనిద్వారా దేహంనుండి బయటకు వస్తాడు.

**2) ముక్తోర్చిర్దినపూర్వ పక్ష షడుదఙ్ మాసాబ్దవాతాంశుమత్**
**గ్లౌః విద్యుద్వరుణేంద్ర ధాతృమహితః సీమాంతసింధ్వాప్లుతః ।**
**శ్రీవైకుంఠ ముపేత్య నిత్యమజడం తస్మిన్ పరబ్రహ్మణః**
**సాయుజ్యం సమవాప్య నందతి సమం తేనైవ ధన్యః పుమాన్ ॥**

ఈ విధంగా ముక్తిని పొందిన పురుషుడు అర్చిస్సు–దినం–శుక్లపక్షం–ఉత్త రాయణం – సంవత్సరం–వాయువు–ఆదిత్యుడు–చంద్రుడు–విద్యుత్తు, వరుణుడు– ఇంద్రుడు–ప్రజాపతి అనే అతివాహిక పురుషులచే సత్కరింప బడినవాడై, ప్రకృతి మండలం చివరివరకు ప్రయాణం చేసి, అక్కడ ఉండే విరజానదిలో స్నానం చేసి, ప్రకృతిసంబంధవాసనను పూర్తిగా నశింప జేసికొని నిత్యమైనది, జడం కానిది అయిన వైకుంఠనగరంలో ప్రవేశం చేస్తాడు. అక్కడ అమానవుని కరస్పర్శతో సత్త్వమయమైన, ప్రకాశించే రూపాన్ని స్వస్వరూపా విర్భావాన్ని పొంది. పరమాత్మతో సామ్యాన్ని పొందుతాడు. భగ వానునితో కలసి ముక్తానందాన్ని పొందుతాడు. అపుడే పురుషుడు (జీవుడు) ధన్యుడవుతున్నాడు.



**ప్రాతర్నిత్యానుసంధేయం పరమార్థం ముముక్షుభిః ।**
**శ్లోకద్వయేన సంక్షిప్తం సువ్యక్తం వరదోఽబ్రవీత్ ॥**

ఉదయకాలంలో ముముక్షువులు నిత్యం అనుసంధించదగిన పరమార్థాన్ని శ్రీవాత్సవరదార్యులనబడే నడాదూర్ అమ్మాళ్ రెండు శ్లోకాలతో క్లుప్తంగా, సుస్పష్టంగా పలికారు.

నడాదూర్ అమ్మాళ్ అనుగ్రహించిన

# పరత్వాది పంచకమ్

( ఇందులో భగవానుని అయిదు రూపాలు స్తుతింపబడ్డాయి. దీనిని కూడా ఉదయం నిద్రలేవగానే చెప్పుకోవడం మంచిది.)

**1) ఉద్యద్భానుసహస్రభాస్వరపరవ్యోమాస్పదం నిర్మల**
**జ్ఞానానందఘనస్వరూప మమలజ్ఞానాదిభిః షడ్గుణైః ॥**
**జుష్టం సూరిజనాధిపం ధృతరథాంగాబ్జం సుభూషోజ్జ్వలం ।**
**శ్రీభూసేవ్య మనంతభోగినిలయం శ్రీవాసుదేవం భజే ॥**

ఉదయించే వేయిమంది సూర్యులవలె ప్రకాశవంతమైన పరమపదాన్ని నిలయంగా కలవాడు, నిర్మలమైన జ్ఞానానందాలను **"విజ్ఞాన ఘన ఏవ"** అని, **"ఆనందమయః"** అని చెప్పబడే రీతిలో స్వరూపంగా కలవాడు, ఏ దోషం లేని జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజస్సులనే ఆఱు గుణాలను కలవాడు, నిత్య సూరులకు నాథుడు, శంఖచక్రధారి, గొప్ప భూషణాభాషలతో మిక్కిలిగా ప్రకాశించేవాడు, లక్ష్మీభూదేవులతో సేవింపబడేవాడు, ఆదిశేషునిపై వేంచేసి ఉన్నవాడైన పరవాసుదేవుని భజిస్తున్నాను. (ఈ శ్లోకంలో భగవానుని పరత్వ రూపం స్తుతింపబడింది)

**2) ఆమోదే భువనే ప్రమోద ఉత సమ్మోదే చ సంకర్షణం**
**ప్రద్యుమ్నం చ తథాఽనిరుద్ధమపి తాన్ సృష్టిస్థితీ చాప్యయమ్ ।**
**కుర్వాణాన్ అతిముఖ్యషడ్గుణవరైః యుక్తాన్ త్రియుగ్మాత్మకైః**
**వ్యూహాధిష్ఠితవాసుదేవ మపి తం క్షీరాబ్ధినాథం భజే ॥**

ఆమోదం, ప్రమోదం, సమ్మోదమనే లోకాలలో సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపాలను ధరించిన వ్యూహవాసుదేవుడు వరుసగా సృష్టిని, రక్షణను, లయాన్ని

చేస్తున్నాడు. ఈ సంకర్షణ – ప్రద్యుమ్న – అనిరుద్ధులు ముగ్గురు, గొప్పదైన జ్ఞానాది గుణాలు ఆతింటిలో రెండు. రెండు రెండు గుణాలను కల్గి ఉంటారు. ప్రద్యుమ్నుడు ఐశ్వర్యవీర్యాలనే రెండు గుణాలను కల్గి సృష్టిని చేస్తాడు. సంకర్షణుడు జ్ఞానబలాలనే రెండు గుణాలను కల్గి లయాన్ని చేస్తాడు. అనిరుద్ధుడు, శక్తి, తేజస్సులనే రెండు గుణాలను కల్గి రక్షణను చేస్తాడు. ఇటువంటి ఈ ముగ్గురు వ్యూహమూర్తులను భజిస్తున్నాను. అదే రీతిలో ఈ ముగ్గురు మూర్తులకు మూలమైనవాడు క్షీరాబ్ధినాథుడైన వ్యూహ వాసుదేవుని భజిస్తున్నాను.

**3) వేదాన్వేషణ మందరాద్రిభరణ క్ష్మోద్ధారణ స్వాశ్రిత**
**ప్రహ్లాదావనభూమిభిక్షణజగద్విక్రాంతయో యత్క్రియాః ।**
**దుష్టక్షత్రనిబర్హణం దశముఖాద్యున్మూలనం కర్షణం**
**కాళింద్యా అతిపాపకంసనిధనం యత్క్రీడితం తం నుమః ॥**

వేదాలను అన్వేషించడం (మత్స్యావతారం, హయగ్రీవావతారం), మందర పర్వతాన్ని ధరించడం (కూర్మావతారం), భూమిని ఉద్ధరించడం (వరాహావతారం), తనను ఆశ్రయించిన ప్రహ్లాదుని రక్షించడం (నరసింహావతారం), భూమిని యాచించడం (వామనావతారం) జగత్తులో విక్రమించడం (త్రివిక్రమావతారం), అనే లీలలు ఎవరివో, దుష్టక్షత్రియులను వధించడం (పరశురామావతారం), రావణాదులను నిర్మూలించడం (శ్రీరామావతారం), కాళిందీ (యమునా) నదిని నాగలితో ఆకర్షించడం (బలరామావతారం), మిక్కిలి పాపిష్ఠివాడైన కంసుని వధించడం (శ్రీకృష్ణావ తారం) – అనేవి ఎవరి క్రీడలో, పలు అవతారాలను ఎత్తిన ఆ భగవానుని స్తుతిస్తున్నాను.

ఇందులో భగవానుని దశావతారాలు, ఒక్కొక్క అవతారంలోని ఒక్కొక్క లీలను ప్రస్తావించడం ద్వారా ప్రస్తావింపబడ్డాయి. బుద్ధావతారానికి బదులుగా త్రివిక్రమావ తారం ప్రస్తుతింపబడింది.

**4) యో దేవాదిచతుర్విధేషు జనిషు బ్రహ్మాండకోశాంతరే**
**సంభక్తేషు చరాచరేషు నివసన్ ఆస్తే సదాంతర్బహిః ।**
**విష్ణుం తం నిఖిలేష్వణుష్వణుతరం భూయత్సు భూయస్తరం**
**సాంగుష్ఠప్రమితం చ యోగిహృదయేష్వాసీన మీశం భజే ॥**

ఏ పరమాత్మ, బ్రహ్మాండకోశం లోపల ఉండే దేవ–మనుష్య–తిర్యక్– స్థావర రూపాలతో అనేకవిధాలుగా ఉండే చరాచరాలలో అంతర్యామిగా నివసించేవాడై, లోపల బయట వ్యాపించి ఉన్నాడో, అటువంటివాడు, అణువుకంటే అణువైనవాడు, పెద్ద పెద్ద వస్తువులకంటే మిక్కిలి పెద్దవాడు, యోగిహృదయాలలో బొటనవేలు పరిమాణంలో అధివసించి ఉండేవాడు, విష్ణువైన ఆ సర్వేశ్వరుని భజిస్తున్నాను. ఈ శ్లోకంలో భగవానుని సర్వవ్యాపి అయిన అంతర్యామిరూపం ప్రస్తావింపబడింది.



**5) శ్రీరంగస్థలవేంకటాద్రికరిగిర్యాదౌ శతేఽష్టోత్తరే**
**స్థానే చాత్మనికేతనేషు చ సదా సాన్నిధ్యమాసేదుషే ।**
**అర్చిరూపిణ మర్చకాభిమతితః స్వీకుర్వతే విగ్రహం**
**పూజాం చాఖిలవాంఛితాన్ వితరతే శ్రీశాయ తస్మై నమః ॥**

శ్రీరంగం, వేంకటాచలం, కరిగిరి (కాంచీపురం) మొదలైన నూట ఎనిమిది దివ్యక్షేత్రాలను, ఆయా గృహారామాదులలోను ఎల్లప్పుడూ సాన్నిధ్యాన్ని కల్గిన అర్చామూర్తి, అర్చకుని అభిమతానుసారంగా తన రూపాన్ని, పూజను పరిగ్రహించేవాడై, కోరినవారి కోరికలను ఇచ్చేవాడైన ఆ శ్రియఃపతికి నమస్కారం.

**6) ప్రాతర్విష్ణోః పరత్వాదిపంచకస్తుతి ముత్తమామ్ ।**
**పఠన్ ప్రాప్నోతి భగవద్భక్తిం వరదనిర్మితామ్ ॥**

వరదార్యులనబడే నడాదూర్ అమ్మాళ్‌చే అనుగ్రహింపబడిన ఈ ఉత్తమ మైన, విష్ణువుయొక్క పరత్వాది పంచ రూపాలను కీర్తించే స్తుతిని ప్రతిదినం ఉదయకాలంలో పఠించేవాడు భగవద్భక్తిని పొందుతాడు.

# శ్లోకద్వయం

(ఈ స్తుతిని ఉదయం నిద్రలేచిన తర్వాత చెప్పుకోవడం మంచిది.)

**1. గ్రాహగ్రస్తే గజేంద్రే రువతి సరభసం తార్క్ష్య మారుహ్యా ధావన్**
**వ్యాఘూర్ణన్ మాల్యభూషావసన పరికరో మేఘగంభీరఘోష: ।**
**ఆబిభ్రాణో రథాంగం శరమపి మభయం శంఖచాపౌ సఖేటౌ**
**హస్తై: కౌమోదకీ మప్యవతు హరిరసౌ అంహసాం సంహతేర్నః ॥**

గజేంద్రుడు మొసలిచే పట్టుకొనబడి ఆక్రందించగా, చాలా వేగంగా గరుడుని ఎక్కి పరుగెత్తి వస్తూ, తాను ధరించిన పూమాలికలు, ఆభరణాలు, వస్త్రం, ఆయుధాలు

మొదలైనవి మిక్కిలిగా చలించగా, మేఘంవలె గంభీరమైన నాదాన్ని కలవాడై, చక్రం, శరం, ఖడ్గం, అభయముద్ర, శంఖం, విల్లు, పరశువు, కౌమోదకి – అనే ఆయుధాలను ఎనిమిది చేతులలో ధరించి వచ్చే హరి మనలను పాపాల సమూహంనుండి రక్షించాలి.

**2. నక్రాక్రాంతే కరీంద్రే ముకుళితనయనే మూలమూలేతి ఖిన్నే**
**నాహం నాహం న చాహం న చ భవతి పున స్తాదృశో మాదృశేషు ।**
**ఇత్యేవం త్యక్తహస్తే సపది సురగణే భావశూన్యే సమస్తే**
**మూలం య: ప్రాదురాసీత్ స దిశతు భగవాన్ మంగళం సంతతం నః ॥**

మొసలిచే గజేంద్రుడు ఆక్రమింపబడగా, అపుడతడు కన్నులను మూసికొని "ఓ జగన్మూలమా!" అని జగత్కారణభూతుడైన భగవానుని ప్రార్థిస్తూ ఖిన్నుడయ్యాడు. అపుడు దేవతలంతా "మాలో ఎవడూ అటువంటివాడు లేదు" అని అంటూ గజేంద్రుని చేయి విడచిపెట్టారు. అపుడు ప్రత్యక్షమైన జగన్మూలభూతుడైన భగవానుడు శ్రీమన్నారాయణుడు మనకు మంగళాన్ని కల్గించాలి.

# శ్లోకత్రయమ్

(ఈ స్తుతిని ఉదయం నిద్రలేచిన తర్వాత చెప్పుకోవడం మంచిది.)

**3. ప్రాతః స్మరామి భవభీతిమహార్తిశాంత్యై**
**నారాయణం గరుడవాహన మంజనాభమ్ ।**
**గ్రాహాభిభూత మదవారణముక్తిహేతుం**
**చక్రాయుధం తరుణవారిజపత్ర నేత్రమ్ ॥**

సంసారభీతివల్ల కల్గిన గొప్ప ఆర్తి, శాంతించడంకోసం గరుడవాహనుడు, కాటుకవలె నల్లని దేహవర్ణాన్ని కలవాడు, మొసలిచే పట్టుకొనబడిన మదపుటేనుగు అయిన గజేంద్రునకు ముక్తిని కల్గించినవాడు, శ్రీసుదర్శనచక్రాన్ని ఆయుధంగా కలవాడు, ఉదయకాలంలో వికసించిన తామరపూల రేకులవలె అందమైన కన్నులను కలవాడైన శ్రీమన్నారాయణుని ఉదయకాలంలో స్మరిస్తున్నాను.

**4. ప్రాతర్నమామి మనసా వచసా చ మూర్ధ్నా**
**పాదారవిందయుగళం పరమస్య పుంసః ।**



**నారాయణస్య నరకార్ణవతారణస్య**
**పారాయణప్రవణ విప్రపరాయణస్య ॥**

నరకమనే సముద్రంనుండి దాటించేవాడు, తన నామాన్ని పారాయణ చేయడంలో మిక్కిలి ఆసక్తిని కల విప్రుల (జ్ఞానుల)పట్ల మిక్కిలి ఆదరాన్ని కలవాడు, పరమ పురుషుడైన శ్రీమన్నారాయణుని పాదారవిందయుగాన్ని ప్రాత:కాలంలో మనస్సుతో, వాక్కుతో, శిరస్సుతో నమస్కరిస్తున్నాను.

**5. ప్రాతర్భజామి భజతా మభయంకరం తం**
**ప్రాక్ సర్వజన్మకృత పాపభయాపనుత్యై ।**
**యో గ్రాహవక్త్రపతితాంఘ్రి గజేంద్రఘోర–**
**శోకప్రణాశనకరో ధృతశంఖచక్రః ॥**

తనను భజించేవారికి అభయాన్ని కల్గించేవాడు, మొసలినోటిలో చిక్కుకొన్న పాదాన్నికల గజేంద్రుని గొప్ప శోకాన్ని తీర్చినవాడు, శంఖచక్రధారి అయిన భగవానుని నే పూర్వజన్మలలో చేసిన పాపాలవల్ల కలిగే భయం తీరడంకోసం ఉదయకాలంలో భజిస్తున్నాను.

**6. శ్లోకత్రయమిదం పుణ్యం ప్రాతరుత్థాయః యః పఠేత్ ।**
**లోకత్రయగురు స్తస్మై దద్యాదాత్మపదం హరిః ॥**

పవిత్రమైన ఈ శ్లోకత్రయాన్ని ఎవడు ఉదయకాలంలో నిద్ర లేచి పఠిస్తాడో, అతనికి ముల్లోకాలకు ప్రభువైన హరి తన పదాన్ని (పరమపదాన్ని ఇస్తాడు)

# శ్రీదేవాధిరాజపంచకమ్

(ఈ స్తుతిని ఉదయం నిద్రలేచిన తర్వాత చెప్పుకోవడం మంచిది. దీనిని చోళసింహపురం దొడ్డయాచార్యస్వామివారు రచించారు.)

**1. ప్రత్యూషే వరదః ప్రసన్నవదనః ప్రాప్తాభిముఖ్యాన్ జనాన్**
**ఆబద్ధాంజలిమస్తకాన్ అవిరళాన్ ఆబాలమానందయన్ ।**
**మందోద్ధాయితచామరో మణిమయశ్వేతాతపత్రైః శనైః**
**అంతర్గోపుర మావిరాస భగవాన్ ఆరూఢపక్షీశ్వరః ॥**

ప్రాతఃకాలంలో వరదరాజస్వామి గరుడుని ఎక్కి ప్రసన్నవదనాన్ని కలవాడై, తనవద్దకు వచ్చినవారు, తమ తలలపై అంజలి ముద్రను పెట్టుకొన్నవారైన పలువురను బాలురవరకు ఆనందింపజేస్తూ, మెల్లగా ఇరు వైపుల చామరాలు వీచబడగా, రెండు వైపుల మణులు పొదిగిన తెల్లని గొడుగులతో మెల్లగా గోపురం లోపలకు వేంచేశాడు.

**2. ముక్తాతపత్రయుగళోభయ చామరాంత: –**
**విద్యోతమాన వినతాతనయాధిరూఢమ్ ।**
**భక్తాభయప్రదకరాంబుజ మంబుజాక్షం**
**నిత్యం నమామి వరదం కమనీయవేషమ్ ॥**

ముత్యాలు పొదిగిన రెండు గొడుగుల, రెండు చామరాల మధ్య ప్రకాశించే (వాడు), గరుడుని అధిరోహించినవాడు, భక్తులకు అభయాన్ని ఇచ్చే అభయముద్రతో కూడిన, పద్మంవంటి హస్తాన్ని కలవాడు, తామరలవంటి కన్నులను కలవాడు, అందమైన రూపాన్ని కలవాడైన వరదరాజస్వామిని నిత్యం సేవిస్తున్నాను.

**3. కేచిత్ తత్త్వవిశోధనే పశుపతౌ పారమ్యమాహుః పరే**
**వ్యాజహ్రుః కమలాసనే నయవిదా మన్యే హరిం సాదరమ్ ।**
**ఇత్యేవం చలచేతసాం కరధృతం పాదారవిందం హరేః**
**తత్త్వం దర్శయతీవ సంప్రతి నృణాం తార్క్ష్యః శ్రుతీనాం నిధిః ॥**

"పరమాత్మ ఎవరు?" అనే విచారణ ఏర్పడినపుడు, కొందఱు శివుడు పరతత్త్వ మని అన్నారు. మఱికొందఱు బ్రహ్మపరతత్త్వమని అన్నారు. ఇంకొందరు హరిపరతత్త్వ మని అన్నారు. ఇందులో ఏది వాస్తవం? అని సందేహపడేవారికి గరుడుడు, తాను హరియొక్క పాదాలను తన చేతులలో ధరించడంద్వారా, "ఇతడే పరతత్త్వ"మనే విషయాన్ని దర్శింపజేస్తున్నాడు.

**4. యద్వేదమౌళిగణవేద్య మవేద్య మన్యైః**
**యద్బ్రహ్మరుద్ర సురనాయకమౌళివంద్యమ్ ।**
**తత్పద్మనాభపదపద్మ మిదం మనుష్యైః**
**సేవ్యం భవద్భిరితి దర్శయతీవ తార్క్ష్యః ॥**

వేదాంతవాక్యసమూహాలచే తెలియదగినవాడు, వేఱు దేనిచేతను తెలియడానికి వీలు కానివాడు, బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు – అనే వీరిచే శిరస్సులతో నమస్కరింప



బడేవాడైన పద్మనాభుని ఈ పాదపద్మాలు మానవులైన మీచే సేవింపదగినవి – అనే విషయాన్ని గరుడుడు తెల్పుతున్నాడు.

**5. ప్రత్యగ్గోపురసంముఖే దినముఖే పక్షీంద్రసంవాహితం**
**నృత్యచ్చామరకోరకం నిరుపమచ్ఛత్రద్వయీభాసురమ్ ।**
**సానందం ద్విజమండలం విదధతం సన్నాహచిహ్నైః రవైః**
**కాంతం పుణ్యకృతో భజంతి వరదం కాంచ్యాం తృతీయోత్సవే ॥**

ఉదయకాలంలో ఆలయగోపురానికి ఎదురుగా సూర్యుడు ప్రకాశించే సమయంలో, గరుడునిచే మోయబడేవాడు, నర్తించే (కదలాడే) మొగ్గలవంటి చామరాలను కలవాడు, సాటిలేని రెండు గొడుగులతో ప్రకాశించేవాడు, తాను వేంచేసే ప్రయత్నానికి చిహ్నాలైన మంగళవాద్యాలతో బ్రాహ్మణసమూహానికి ఆనందాన్ని కల్గించేవాడు,అందమైనవాడైన వరదరాజస్వామిని పుణ్యాత్ములు కాంచీనగరంలో మూడవ ఉత్సవంనాడు భజిస్తున్నారు.

# ఊర్ధ్వపుండ్రధ్యానవిధి

(ఈ స్తుతిలో, దేహంలో 12 చోట్ల ఊర్ధ్వపుండ్రాలను ధరించేటప్పుడు ధ్యానించవలసిన 12 మంది భగవన్మూర్తుల నామం, రూపం, ఆ స్వామితో కలిసివుండే లక్ష్మీదేవి నామం మొదలైనవి తెలుపబడ్డాయి. దీనిని నామాన్ని ధరించేటప్పుడు చెప్పుకోవడం మంచిది.)

**1. లలాటే సతతం దేవ్యా శ్రియా సహ విరాజితమ్ ।**
**చతుశ్చక్రం నమస్యామి కేశవం కనకప్రభమ్ ॥**

ఎల్లప్పుడు శ్రీదేవితో కలసి ఉండి విరాజిల్లేవాడు, నాల్గు చక్రాలను నాల్గు చేతులలో ధరించినవాడు, బంగారు రంగును కలవాడైన కేశవుని లలాటంలో (నుదుటి భాగంలో) నమస్కరిస్తున్నాను.

**2. అమృతోద్భవయా దేవ్యా సమాశ్లిష్ట మథోదరే ।**
**నారాయణం ఘనశ్యామం చతుశ్శంఖం నమామ్యహమ్ ॥**

అమృతోద్భవ అనే లక్ష్మీదేవితో కలసి ఉండేవాడు, మేఘంవలె నల్లనివాడు, నాల్గు శంఖాలను నాల్గు చేతులలో ధరించినవాడైన నారాయణుని ఉదరభాగంలో నమస్కరిస్తున్నాను.

**3. నిత్యం కమలయా శ్లిష్టం హృదయేఽహం దయాంబుధిమ్ ।**
**మాధవం మణిభంగాభం చింతయామి చతుర్గదమ్ ॥**

కమల అనబడే లక్ష్మీదేవితో నిత్యంకలసి ఉండేవాడు, దయకు సముద్రం వంటివాడు, నీలమణివర్ణంవంటి వర్ణాన్ని కలవాడు, నాల్గు గదలను నాల్గు చేతులలో ధరించినవాడైన మాధవుని హృదయ ప్రదేశంలో ధ్యానిస్తున్నాను.

**4. దేవ్యా చ చంద్రశోభిన్యా దేవం కంఠే విరాజితమ్ ।**
**చంద్రాభాసం చతుఃశార్ఙ్గం గోవింద మహమాశ్రయే ॥**

చంద్రశోభిని అనే లక్ష్మీదేవితో కూడి ప్రకాశించేవాడు, చంద్రునికాంతివంటి కాంతిని కలవాడు, నాల్గు ధనుస్సులను నాల్గు చేతులలో కలవాడైన గోవిందుని నేను కంఠంలో ధ్యానించి ఆశ్రయిస్తున్నాను.

**5. విష్ణుపత్న్యాఖ్యయా దేవ్యా కుక్షౌ దక్షిణపార్శ్వగమ్ ।**
**విష్ణుం చతుర్హలం వందే పద్మకింజల్కసన్నిభమ్ ॥**

విష్ణుపత్ని అనబడే లక్ష్మీదేవితోకూడి ఉండేవాడు, తామరపూవులోని కింజల్కం వర్ణంవంటి వర్ణాన్ని కలవాడు, నాల్గు చేతులలో నాల్గు హలాయుధాలను కలవాడైన విష్ణువును ఉదరంలోని కుడివైపున నమస్కరిస్తున్నాను.

**6. వైష్ణవీసంజ్ఞయా దేవ్యా కలితం దక్షిణే భుజే ।**
**చతుర్ముసల మబ్జాభం సంశ్రయే మధుసూదనమ్ ॥**

వైష్ణవి అనే పేరును కల లక్ష్మీదేవితో కూడినవాడు, ముసలమనే ఆయుధాలను నాల్గింటిని నాల్గు చేతులలో ధరించినవాడు, పద్మవర్ణంవంటి వర్ణాన్ని కలవాడైన మధుసూదనుని కుడిభుజంతో ఆశ్రయిస్తున్నాను.

**7. దక్షిణాంసే దయావార్ధిం వరారోహాధిపం ప్రభుమ్ ।**
**అగ్నివర్ణం చతుఃఖడ్గం భావయామి త్రివిక్రమమ్ ॥**

వరారోహ అనే పేరును కల లక్ష్మికి నాథుడు, ప్రభువు, దయకు సముద్రుడు, అగ్నివర్ణంవంటి వర్ణాన్ని కలవాడు, నాల్గు చేతులలో నాల్గు ఖడ్గాలను కలవాడైన త్రివిక్రముని కంఠభాగం కుడివైపున భావిస్తున్నాను.

**8. హరిఃప్రియాపతిం కుక్షౌ వామపార్శ్వస్థ పుండ్రగమ్ ।**
**వామనం బాలసూర్యాభం చతుర్వజ్రం విభావయే ॥**



హరిప్రియ (హరివల్లభ) అనే పేరును కల లక్ష్మికి పతి, బాలసూర్యుని ప్రకాశం వంటి ప్రకాశాన్ని కలవాడు, నాల్గు వజ్రాయుధాలను నాల్గు చేతులలో కలవాడైన వామనుని ఉదరంలో ఎడమవైపున గల ఊర్ధ్వపుండ్రంలో ధ్యానిస్తున్నాడు.

**9. వామబాహౌ మహాబాహుం శార్ఙ్గిణీపతి మవ్యయమ్ ।**
**శ్రీధరం పుండరీకాభం చతుఃపట్టం సమాశ్రయే ॥**

గొప్ప బాహువులను కలవాడు, శార్ఙ్గిణి అనే పేరును గల లక్ష్మికి నాథుడు, అవ్యయుడు, తెల్లతామర ప్రకాశంవంటి ప్రకాశాన్ని కలవాడు, నాల్గు పట్టాకత్తులను నాల్గు చేతులలో కలవాడైన శ్రీధరుని ఎడమవైపు బాహువులో ఆశ్రయిస్తున్నాను.

**10. దేవదేవికయా దేవ్యా శ్రితం వామాంససంశ్రితమ్ ।**
**చతుర్ముద్గర మభ్యేమి హృషీకేశం తటిత్ప్రభమ్ ॥**

దేవదేవి అనే పేరును కల లక్ష్మితో కూడినవాడు, నాల్గు ముద్గరాలనే ఆయుధాలను నాల్గు చేతులలో కలవాడు, మెఱుపువలె ప్రకాశించేవాడైన హృషీకేశుని కంఠం ఎడమ వైపు భాగంలో ఆశ్రయిస్తున్నాను.

**11. పృష్ఠే సంప్రహృష్టయా దేవ్యా మహాలక్ష్మ్యా విరాజితమ్ ।**
**పంచాయుధం పద్మనాభం ప్రణమామ్యర్కరోచిషమ్ ॥**

ఆనందాన్ని పొందిన, మహాలక్ష్మి అనబడే లక్ష్మితో విరాజిల్లేవాడు, అయిదు ఆయుధాలను కలవాడు, సూర్యుని కాంతివంటి కాంతిని కలవాడైన పద్మనాభుని వెనుక భాగంలో ప్రణమిల్లుతున్నాను.

**12. సదా కకుద్మతం లోకసుందరీపతి మద్భుతమ్ ।**
**దామోదరం చతుఃపాశం మింద్రగోపనిభం భజే ॥**

లోక సుందరి – అనబడే లక్ష్మికి పతి, ఆశ్చర్యకరమైనవాడు, నాల్గు పాశాయుధాలను నాల్గు చేతులలో కలవాడు, ఇంద్రగోపం (ఆరుద్ర పురుగు) కాంతివంటి కాంతిని కలవాడైన దామోదరుని ఎల్లప్పుడు మెడ వెనుకభాగంలో భజిస్తున్నాను.

**13. సర్వాభీష్టప్రదాధీశం మూర్ధ్ని సర్వాయుధం విభుమ్ ।**
**వాసుదేవ ముపాసేఽహం పూర్ణేంద్వయుతసన్నిభమ్ ॥**

అన్ని కోరికలను అనుగ్రహించే ప్రభువు, సమస్తాయుధాలను ధరించేవాడు, పలువేల కోట్ల పూర్ణచంద్రుల కాంతివంటి కాంతిని కలవాడైన వాసుదేవుని శిరస్సుపై ఉపాసిస్తున్నాను.

**14. ఏవం యః కురుతే పుంద్రే దేవతాధ్యానమన్వహమ్ ।**
**తస్య దేహే హరి స్తిష్ఠత్యనిశం రమయా సహ ॥**

ఈ రీతిలో పన్నెండు ఊర్ధ్వపుండ్రాలలో ఆయా భగవన్మూర్తుల ధ్యానాన్ని చేసే వాని దేహంలో భగవానుడు లక్ష్మిదేవితో పాటు కలసి సదా వేంచేసి ఉంటాడు.

# పొదుత్తనియన్‌లు

**1. శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।**
**యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥**

తిరుమలైయాఴ్వార్ అనబడే తిరువాయ్‌మొఴిప్పిళ్ళై (శ్రీశైలేశుల) అనుగ్రహానికి పాత్రమైన వారు, జ్ఞానభక్త్యాది కల్యాణగుణాలకు సముద్రంవంటివారు, భగవద్రామానుజుల పట్ల ప్రావణ్యాన్ని కలవారైన శ్రీవరవరమునులకు నమస్కరిస్తున్నాను.

**2. లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామున మధ్యమామ్ ।**
**అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥**

శ్రియఃపతిని ప్రారంభంలో కల్గినది, శ్రీమన్నాథముని- యామునమునులను మధ్యలో కల్గినది, మనకు ఆచార్యులైన భగవద్రామానుజులను చివరలో కల్గినది అయిన ఆచార్యపరంపరకు నమస్కరిస్తున్నాను.

**3. యో నిత్య మచ్యుతపదామ్బుజ యుగ్మరుక్మ -**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురో ర్భగవతోஉస్య దయైకసిన్ధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఏ భగవద్రామానుజులు నిత్యంగా భగవానుని శ్రీచరణపద్మయుగమనే బంగారంలో కల గొప్ప వ్యామోహంవల్ల, ఆ పదపద్మాల కంటే వేఱయిన అన్ని విషయాలను గడ్డిపోచగా తలచి విడచి వేశారో, మాకు ఆచార్యులు, సమస్తకల్యాణగుణ పరిపూర్ణులు, కరుణా సముద్రులు అయిన ఈ భగవద్రామానుజుల శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను.



**4. మాతా పితా యువతయ స్తనయా విభూతిః**
**సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**
**ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం**
**శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥**

నా వంశంలోనివారికి ఎల్లప్పుడు తల్లి, తండ్రి, భార్య, సంతానం, సంపద- ఇంకా అన్నీ నమ్మాఴ్వార్ల, శ్రీచరణాలే అవుతున్నవి. మన కులకూటస్థులైన, ఆ నమ్మాఴ్వార్ల, వకుళపూలచే అందమైన, నిత్యోజ్జ్వలమైన ఆ శ్రీచరణాలను శిరసా నమస్కరిస్తున్నాను.

**5. భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ -**
**శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।**
**భక్తాంఘ్రిరేణుపరకాల యతీన్ద్రమిశ్రాన్**
**శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోஉస్మి నిత్యమ్ ॥**

పూదత్తాఴ్వార్లు, పొయ్‌కై ఆఴ్వార్లు, పేయాఴ్వార్లు, పెరియాఴ్వార్లు, ఆణ్డాళ్, తిరుమఴిశై ఆఴ్వార్లు, కులశేఖరాఴ్వార్లు, తిరుప్పాణ్ ఆఴ్వార్లు, తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు, తిరుమఙ్గైయాఴ్వార్లు, మధురకవి ఆఴ్వార్లు, భగవద్రామానుజులు, నమ్మాఴ్వార్లు - అనే వీరిని నేను నమస్కరిస్తున్నాను.

(స్నానాంతరం **"శ్రీశైలేశ"** అనే తనియన్ శ్లోకాలను, అష్టాక్షరి, ద్వయమంత్రాలను చెప్పుకొన్న తర్వాత ఈ శ్లోకాలను చదువుకోవాలి)

# శ్రీకృష్ణచరమశ్లోకం

**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

అన్ని ధర్మాలను (అవి ఉపాయాలు కావు - అని) విడచిపెట్టి నన్ను ఒక్కని మాత్రమే ఉపాయంగా ఆశ్రయించు. నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను. శోకించకు.

## వరాహచరమశ్లోకం

**స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ।**
**ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్ ॥**
**తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్ ।**
**అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్ ॥**

మనసు స్వస్థస్థితిలో ఉండగా, ధాతువులు సమానస్థితిలో ఉండగా ఏ జీవుడు విశ్వరూపుడనైన, కర్మమూలకజన్మను లేని నన్ను స్మరిస్తాడో, అతడు మరణించే స్థితిలో కాష్ఠంవలె, పాషాణంవలె పడి ఉన్నపుడు నేను అతనిని స్మరిస్తాను, ఉత్తమగతికి తీసికొనిపోతాను.

## శ్రీరామచరమశ్లోకం

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ ॥**

నేను నీవాడనని ఒక్కసారి శరణాగతి చేసినవానికి, అభయాన్ని యాచించేవానికి ప్రాణులందరివల్ల భయంలేకుండా చేస్తాను. ఇది నా వ్రతం.

# ఆచార్యతనియన్ పరంపర

(ఈ శ్లోకాలను శ్రీకృష్ణ, శ్రీరామ, వరాహ చరమ శ్లోకాలను, శ్లోక గురు పరంపరను అనుసంధించుకున్న తరువాత చెప్పుకోవాలి)

1. **శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే ।**
**చిన్తామణి మినోద్వాన్త ముత్సంగేఽనన్తభోగినః ॥**

ఆదిశేషుని ఒడిలో అతడు తన నోటినుండి వెలువరించిన చింతామణివలె తోచేవాడు, లక్ష్మీదేవి వక్షఃస్థలానికి ఆభరణంవంటివాడు, పరంజ్యోతి స్వరూపుడైన శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను.

2. **నమ శ్శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః ।**
**ఈశేశితవ్య వైషమ్య నిమ్నోన్నత మిదం జగత్ ॥**



ఏ శ్రీరంగనాయకి కనుబొమల కదలికలలోని భేదాలవల్ల ఈ జగత్తు పాలించేవాడు – పాలింపబడేవారనే రీతిలో హెచ్చు తగ్గులుగా ఉన్నదో, ఆ శ్రీరంగనాయకికి నమస్కారం.

3. **శ్రీరంగచన్ద్రమస మిన్దిరయా విహర్తుం**
**విన్యస్య విశ్వచిదచిన్నయనాధికారమ్ ।**
**యో నిర్వహత్యనిశ మంగుళిముద్రయైవ**
**సేనాన్య మన్యవిముఖా స్తమశిశ్రియామ ॥**

శ్రీరంగంలోని చంద్రునివంటివాడైన శ్రీరంగనాథుడు శ్రీరంగనాయకితో పాటు విహరించడానికి వీలుగా, ఈ జగత్తులోని చేతనాచేతనాలను నియమించే అధికారాన్ని కేవలం అంగుళిముద్రతోనే నిర్వహించేవాడైన సేనాధిపతి అయిన విష్వక్సేనుని అనన్యమనస్కులమై ఆశ్రయిస్తాము.

4. **మాతా పితా యువతయ స్తనయా విభూతిః**
**సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**
**ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం**
**శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥**

మా ప్రపన్నకులంలోనివారికి అందరికి నిత్యంగా తల్లి, తండ్రి, భార్య, సంతానం, సంపద – అన్నీ శఠకోపుల పాదపద్మయుగమే. మాకు ఆద్యులు, ప్రపన్న కులనాథులు అయిన ఆ శఠకోపుల పాదపద్మయుగ్మం వకుళమాలికతో అందంగా ఉన్నది, సంపదను కల్గి ఉన్నది. ఆ పాదపద్మయుగ్మాన్ని శిరస్సుతో నమస్కరిస్తున్నాను.

5. **నమోఽచింత్యాద్భుతాక్లిష్టజ్ఞాన వైరాగ్యరాశయే ।**
**నాథాయ మునయేఽగాథ భగవద్భక్తి సింధవే ॥**

భావించడానికి సాధ్యం కాని, ఆశ్చర్యకరమైన, సహజమైన జ్ఞానవైరాగ్యాలకు రాశి, అగాధమైన భగవద్భక్తికి(అగాధమైన) సముద్రం వంటివారైన నాథమునులకు నమస్కారం.

6. **నమః పంకజనేత్రాయ నాథశ్రీపాదపంకజే ।**
**న్యస్తసర్వభరాయ అస్మత్కులనాథాయ ధీమతే ॥**

అందరికి నాథుడైన భగవానుని శ్రీచరణపద్మాలలో తమ రక్షణ భారాన్ని సమర్పించినవారు, గొప్ప జ్ఞానాన్ని కలవారు, మన కులానికి నాథులైన పుండరీకాక్షులకు (ఉయ్యక్కొణ్డార్‌కు) నమస్కారం.

**7. అయత్నతో యామున మాత్మదాసమ్ అలర్కపత్రార్పణనిష్క్రయేణ ।**
**యః క్రీతవానాస్థితయౌవరాజ్యం నమామి తం రామ మమేయసత్త్వమ్॥**

యువరాజపదవిలో ఉండే శ్రీయామునులకు ముళ్ళఉస్తెకూరను (అలర్క పత్రాలను) ఇవ్వడంద్వారా అనాయాసంగా వారిని తమకు దాసులుగా పరిగ్రహించిన వారు, గొప్ప బలాన్ని (సత్త్వగుణాన్ని) కలవారైన శ్రీరామ మిశ్రులను (మణక్కాల్ నమ్బిని) నమస్కరిస్తున్నాను.

**8. యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥**

ఏ యామునుల పదాంబుజాల ధ్యానంవల్ల నా సమస్తపాపాలు నశించిపోయాయో, నేను సత్తను పొందానో, ఆ శ్రీయామునులను (ఆళవందార్‌ను) నమస్కరిస్తున్నాను.

**9. కమలాపతికల్యాణ గుణామృతనిషేవయా ।**
**పూర్ణకామాయ సతతం పూర్ణాయ మహతే నమః ॥**

శ్రియఃపతియొక్క కల్యాణగుణాలనే అమృతాన్ని సేవించడంవల్ల పరిపూర్ణ మైన మనోరథాన్ని కలవారు, గొప్పవారైన మహాపూర్ణులకు (పెరియనంబికి) నమస్కారం.

**10. యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ-**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఏ శ్రీరామానుజులు నిత్యం అచ్యుతుని బంగారంవలె స్పృహణీయా లైన రెండు పదాంబుజాలపట్ల గల వ్యామోహంతో మిగిలిన అన్నిటిని తృణంగా, భావించారో, అటువంటి దయకు సముద్రంవంటివారైన, షాడ్గుణ్యాన్ని కల్గినవారైన, మనకు ఆచార్యులైన శ్రీరామానుజుల శ్రీచరణాలను రెండిటిని శరణంగా ఆశ్రయిస్తున్నాను.

**11. రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వానపాయినీ ।**
**తదాయత్తస్వరూపా సా జీయా న్మద్విశ్రమస్థలీ ॥**

శ్రీరామానుజుల పాదచ్ఛాయవంటివారు, వారిని ఏనాడూ విడచి ఉండని, ఆ శ్రీరామానుజులవల్ల స్వరూపసిద్ధిని పొందిన వారు, గోవిందులనే పేరును కల వారైన (ఎమ్బార్ అనే) నా విశ్రమస్థానం ఎల్లప్పుడు వర్ధిల్లాలి.



**12. శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।**
**శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥**

శ్రీరంగనాథునకు పురోహితులు, జ్ఞానభక్తివైరాగ్యసంపన్నులు, కూరేశుల పుత్రులైన శ్రీపరాశరభట్టర్ నాకు గొప్ప హితాన్ని కల్గించాలి.

**13. నమో వేదాన్తవేద్యాయ జగన్మంగళహేతవే ।**
**యస్య వాగమృతాసారపూరితం భువనత్రయమ్ ॥**

జగన్మంగళానికి మూలకారణభూతులు, తమ వాగమృతప్రవాహంతో ముల్లోకాలను నిండించినవారైన వేదాంతికి (నంజీయర్‌కు) నమస్కారం.

**14. వేదాన్తవేద్యామృతవారిరాశేః వేదార్థసారామృతపూర మగ్ర్యమ్ ।**
**ఆదాయ వర్షంతమహం ప్రపద్యే కారుణ్యపూర్ణం కలివైరిదాసమ్ ॥**

వేదాంతవేద్యులనే (నంజీయర్ అనే) సముద్రంనుండి వేదార్థసారమనే గొప్ప అమృతప్రవాహాన్ని గ్రహించి, దానిని లోకానికి వర్షించే కవివైరిదాసులకు (నమ్బిళ్ళైకు) నేను నమస్కరిస్తున్నాను.

**15. శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమో యామునసూనవే ।**
**యత్కటాక్షైకలక్ష్యాణాం సులభ శ్శ్రీధర స్సదా ॥**

శ్రీ యామునుల కుమారులు, శ్రీకృష్ణనామాన్ని కలవారైన పెరియవాచ్చాన్ పిళ్ళైకు నమస్కారం. వారి కటాక్షానికి పాత్రమైనవారికి శ్రియఃపతి సదా సులభుడు.

**16. శ్రీకృష్ణపాదపాదాబ్జే నమామి శిరసా సదా ।**
**యత్ప్రసాదప్రభావేవ సర్వసిద్ధి రభూన్మమ ॥**

ఏ శ్రీకృష్ణపాదుల ప్రభావంవల్ల నాకు సకలసిద్ధులు కలిగాయో, ఆ శ్రీకృష్ణ పాదుల (వడక్కుత్తిరువీది ప్పిళ్ళై) పాదపద్మాల జంటకు సదా శిరసా నమస్కరిస్తున్నాను.

**17. లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే ।**
**సంసారభోగిసందష్ట జీవజీవాతవే నమః ॥**

శ్రీకృష్ణపాదుల (వడక్కుత్తిరువీదిప్పిళ్ళై) కుమారులు, సంసారమనే సర్పంచేత కఱువబడిన సంసారి చేతనులను ఉజ్జీవింపజేసే జీవనౌషధంవంటివారైన శ్రీలోకా చార్యులకు (పిళ్ళైలోకాచార్యులవారికి) నమస్కారం.

**18. నమ శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే ।**
**ప్రసాదలబ్ధ పరమప్రాప్య కైంకర్యశాలినే ॥**

కుంతీనగరంలో జన్మించినవారు, శ్రీపిళ్ళైలోకాచార్యులవారి అనుగ్రహంవల్ల పరమప్రాప్యమైన ఆళ్వార్ల విషయంలోని కైంకర్యాన్ని పొంది ప్రకాశించేవారైన శ్రీశైలనాథులకు (తిరువాయ్‌మొళ్ళి ప్పిళ్ళైకు) నమస్కారం.

**19. శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।**
**యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥**

శ్రీశైలేశుల దయకు పాత్రమైనవారు, జ్ఞానభక్త్యాది గుణాలకు సముద్రం వంటివారు, శ్రీరామానుజులపట్ల గొప్ప భక్తిని కలవారైన రమ్యజామాతృమునులను (శ్రీవరవరమునులను) నమస్కరిస్తున్నాను.

శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన

# అష్టశ్లోకి

**శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।**
**శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥**

శ్రీరంగనాథుని పురోహితులు, శ్రీవత్సాంకులనబడే కూరేశుల పుత్రులు, జ్ఞానభక్తులనే సంపదను కలవారైన శ్రీపరాశరభట్టార్యులు నాకు గొప్ప మంచిని కల్గించాలి.

(ఇది పరాశరభట్టర్ ప్రార్థనా శ్లోకం. ఈ స్తుతిలోని ఎనిమిది శ్లోకాలు అష్టాక్షరి, ద్వయం, శ్రీకృష్ణచరమశ్లోకాలనే మూడు రహస్యాలలోని అర్థాన్ని విశదం చేస్తున్నవి. దీనిని ఉదయం ఆరాధనకు ముందు చెప్పుకోవడం సదాచారం.)

## అష్టాక్షరీమంత్రార్థం

**1) అకారార్థో విష్ణుః జగదుదయరక్షాప్రళయకృత్**
**మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవ మిదమ్ ।**



**ఉకారోఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః**
**త్రయీసారస్త్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ ॥**

సకలజగత్తుల సృష్టి–స్థితి–సంహారాలను చేసేవాడైన, సర్వవ్యాపకుడైన విష్ణువు ప్రణవం (ఓంకారం)లోని అకారంచేత తెలుపబడుతున్నాడు. జ్ఞానానందాలను స్వరూపంగా కల్గిన జీవాత్మ మకారంచేత చెప్పబడు తున్నాడు. ఈ జీవాత్మ, భగవానునకు మాత్రమే చెందిన శేషవస్తువు – అనేది అకారంపై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తిచే తెలుపబడుతున్నది. ఇక, ప్రణవంలోని ఉకారం (అకార మకారాలకు మధ్యలో ఉండే ఉకారం) ఈ జీవాత్మ, పరమాత్మల మధ్య ఉండే సంబంధాన్ని పతిపత్నీభావ సంబంధంవలె ఐకాంతికమని నియమిస్తున్నది. ఏవిధంగా భార్య, ఆమె భర్తకు మాత్రమే చెందినదై ఉంటుందో, ఆ విధంగానే భగవానునకు భార్యవంటివారైన జీవులు, తమకు భర్తవంటి వాడైన శ్రీమన్నారాయణునకు మాత్రమే చెందినవారు – అనే అనన్యార్హమైన – ఇంకొకరికి చెందని – సంబంధాన్ని ఉకారం నియమిస్తున్నది. ఈ విధంగా వివరింపబడిన అర్థాన్ని ఋగ్వేద – యజుర్వేద – సామవేదాలనే మూడు వేదాల సారంగాను, మూడు అక్షరాల రూపంగాను, మూడు పదాల రూపంగాను ఉండే ఓంకారం (ప్రణవం) తెలుపుతున్నది.

**2) మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసః స్వరూపం గతిః**
**గమ్యం శిక్షిత మీక్షితేన పురతః పశ్చాదపి స్థానతః ।**
**స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తిశ్చ నాన్యోచితా**
**తస్యైవేతి హరేః వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః ॥**

చాలా గొప్ప మంత్రమైన అష్టాక్షరిలో మధ్యలో ఉండేది, తనకు ముందున్న ప్రణవంతో కలిపినది అయిన నమస్సుచే (నమఃశబ్దంచే) **"ఓమ్–నమః"** అనే రీతిలో జీవాత్మయొక్క అనన్యార్హశేషత్వమనే స్వరూపం నిష్కర్షింపబడింది. స్వస్థానంలోనే ఆవృత్తిని పొందిన నమశ్శబ్దంచే (**"నమో నమః"** – అనే క్రమంలో) ఉపాయం (జీవుని అనన్యశరణత్వం) నిష్కర్షింప బడింది. తనకు తరువాత గల నారాయణపదంతో చేరిన నమఃశబ్దంచే (**"నమో నారాయణాయ"** – అనే క్రమంలో) ఉపేయం (జీవుని అనన్య భోగ్యత్వం) నిష్కర్షింపబడింది. ఈవిధంగా శిక్షింపబడిన అర్థాలు ఏవి? అంటే – స్వతంత్రుడై ఉండే స్థితి, రక్షణ, శేషత్వానుగుణమైన కైంకర్యవృత్తి – అనే ఇవి హరిశబ్దవాచ్యుడైన ఆ భగవానునకే తగినవి – అని, ఇక ఎవ్వరికి తగినవి కావు – అనే ఈ అర్థాలు వివరించి చెప్పబడ్డాయి. అందువల్ల, పూర్వం తెలుపబడిన మూడు

– అంటే – స్వాతంత్ర్యం, తనను తాను రక్షించుకోవడం, శేషత్వాను గుణమైన కైంకర్యం (కైంకర్యాన్ని గ్రహించడం) అనే మూడు తనకు కూడా (జీవునకు కూడా) తగినవి కావు – అనే విషయంకూడా తేటతెల్లమవుతున్నది.

**3) అకారార్థాయైన స్వమహ మథ మహ్యం న నివహాః**
**నరాణాం నిత్యానా మయనమితి నారాయణపదమ్ ।**
**యమాహాస్మై కాలం సకలమపి సర్వత్ర సకలాసు**
**అవస్థాసు ఆవిఃస్యుః మమ సహజకైంకర్యవిధయః ॥**

మకారంచేత తెలుపబడే నేను (జీవుడు) అకారంచేత చెప్పబడే నారాయణునకే శేషభూతుడను (ఇది ప్రణవార్థం). ఆ పిమ్మట, నేను నాకు శేషభూతుడను కాను (ఇది నమఃశబ్దార్థం). నారాయణపదం – నిత్య వస్తువుల సమూహానికి ఆధారమైన వాడు – నారాయణుడు అని (తత్పురుషసమాసం ద్వారా), అనిత్యవస్తుసమూహాన్ని తనకు ఆధారంగా కలవాడు – నారాయణుడు అని (బహుప్రీహిసమాసంవల్ల) ఏ భగవానుని తెల్పుతున్నదో, ఆ భగవానునకు అన్ని సమయాలలోను సర్వత్ర అన్ని విధాలైన అవస్థలలోను నేను సహజమైన కైంకర్యాలను చేసేవాడను కావాలి (ఇది **"నారాయణాయ"** అనే పదం యొక్క అర్థం.)

**4) దేహాసక్తాత్మబుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యాత్ తృతీయం**
**స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమ మితరశేషత్వధీశ్చేత్ ద్వితీయమ్ ।**
**ఆత్మత్రాణోన్ముఖశ్చేత్ నమ ఇతిచ పదం బాంధవాభాసలోలః**
**శబ్దం నారాయణాఖ్యం విషయచపలధీశ్చేత్ చతుర్థీం ప్రపన్నః ॥**

ప్రపన్నుడు, దేహంపట్ల ఆత్మబుద్ధిని కలవాడైతే (దేహాత్మభ్రాంతిని కలవాడైతే) ప్రణవంలోని మూడవ పదమైన మకారాన్ని బాగా గమనించాలి. స్వస్వాతంత్ర్యభ్రమను – నేను స్వతంత్రుడను – అనే భ్రమను – అనే కలవాడైతే మొదటి పదమైన (లుప్త చతుర్థీవిభక్తితో కూడిన) అకారాన్ని గమనించాలి. అన్యశేషత్వభ్రమను– ఇతరులకు నేను శేషమనే భ్రమను – కలవాడైతే ప్రణవంలోని రెండవ పదమైన ఉకారాన్ని గమనించాలి. స్వరక్షణలో తనకు బాధ్యత ఉన్నదనే భావనను కలవాడైతే **"నమః"** అనే – అష్టాక్షరిలోని మధ్యమపదాన్ని గమనించాలి. భగవానునికంటే ఇంకొకరు తనకు బంధువులనే భావన కల్గి ఉంటే – ఆభాసబంధువులపట్ల ఆసక్తిని కల్గిఉంటే – నారాయణశబ్దాన్ని గమనించాలి. లౌకికవిషయాలపట్ల చాపల్యాన్ని కలవాడైతే – నారాయణపదంపై గల చతుర్థీ విభక్తిని గమనించాలి.



## ద్వయమంత్రార్థం

**5) నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనం చ**
**ఉపాయం కర్తవ్యభాగం త్వథ మిథునపరం ప్రాప్య మేవం ప్రసిద్ధమ్।**
**స్వామిత్వం ప్రార్థనాం చ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాన్**
**మంతారం త్రాయతే చేత్ అధిగతనిగమః షట్పదోఽయం ద్విఖండః॥**

లక్ష్మీపురుషకారత్వం (శ్రీశబ్దార్థం), ఆమె ఒక క్షణం అయినా స్వామి విడచి ఉండని నిత్య సంశ్లేషం (మతుప్ ప్రత్యయార్థం), ఆశ్రయణానికి తగిన భగవానుని కల్యాణగుణాల సమూహం (నారాయణశబ్దార్థం), భగవానుని తిరుమేనిని తెలియ జేయడం ("చరణౌ" శబ్దార్థం), భగవానుని ఉపాయత్వం (శరణ శబ్దార్థం), చేతనుడు కల్గి ఉండవలసిన అధ్యవసాయం (**"ప్రపద్యే"** శబ్దార్థం), దివ్యదంపతులను ఇరువురిని ఉద్దేశించి ప్రపన్నుడు చేసే కైంకర్యం (ఉత్తర వాక్యంలోని శ్రీమచ్ఛబ్దార్థం), స్వామిత్వం (ఉత్తరవాక్యంలోని నారాయణ శబ్దార్థం), కైంకర్యప్రార్థన (ఉత్తరవాక్యంలోని నారాయణశబ్దంపై గల చతుర్థీవిభక్తియొక్క అర్థం). మిక్కిలి ప్రబలమైన ఉపేయ విరోధిని తొలగించడం (ఉత్తర వాక్యం చివరగల నమశ్శబ్దార్థం) అనే పది అర్థాలను తెల్పుతూ, వీటిని అనే విషయాలను వేదసిద్ధమైనది, రెండు ఖండాలను కల్గినది, ఆఱు పదాలను కల్గినది అయిన ఈ ద్వయ మంత్రం అనుసంధించే ఉత్తమాధికారిని కాపాడుతున్నది – అనే ఈ విషయం ప్రసిద్ధం.

**6) ఈశానాం జగతా మధీశదయితాం నిత్యానపాయాం శ్రియం**
**సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణస్యాంఘ్రీ హరేరాశ్రయే ।**
**ఇష్టోపాయతయా శ్రియా చ సహితాయాత్మేశ్వరాయార్థయే**
**కర్తుం దాస్య మశేష మప్రతిహతం నిత్యం త్వహం నిర్మమః ॥**

లోకాలకు ఈశ్వరి, సర్వేశ్వరునకు ప్రాణవల్లభ, ఒకక్షణం కూడా అతనిని విడచి ఉండనిది అయిన లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించి, శరణవరణానికి తగిన కల్యాణగుణాలను కల భగవానుని శ్రీచరణాలను ఇష్టసాధనంగా ఆశ్రయిస్తున్నాను. (ఇది ద్వయంలోని పూర్వవాక్యార్థం) లక్ష్మీదేవితో కూడి ఉండేవాడు, సర్వశేషి అయిన నారాయణునకు చేసే కైంకర్యంలో విరోధియైన మమకారం ఏమాత్రం లేని నేను ఆ స్వామికి సర్వవిధ కైంకర్యాలను ఏ అంతరాయం లేకుండా నిత్యంగా చేయడంకోసం ప్రార్థిస్తున్నాను (ఇది ఉత్తరవాక్యార్థం).

## చరమశ్లోకార్థం

7) మత్ప్రాప్త్యర్థతయా మయోక్త మఖిలం సంత్యజ్య ధర్మం పునః
మామేకం మదవాప్తయే శరణ మిత్యార్తోఽవసాయం కురు ।
త్వామేవం వ్యవసాయయుక్త మఖిలజ్ఞానాదిపూర్ణోఽహ్యహం
మత్ప్రాప్తిప్రతిబంధకై ర్విరహితం కుర్యాం శుచం మా కృథాః ॥

నన్ను పొందడానికి ఉపాయంగా, నీ మనస్సును పరీక్షించడంకోసం నాచే చెప్పబడిన ధర్మాలను అన్నిటిని నీవు విడచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే ఉద్దేశించి ఆర్తుడవై, (ఆర్తిని-అభిలాషను-కలవాడవై) నన్ను పొందడానికి నేనే ఉపాయమనే నిశ్చయాన్ని పొందు. ఇటువంటి నిశ్చయంతో కూడిన నిన్ను జ్ఞానాదిగుణాలతో పూర్ణుడనైన నేను నన్ను పొందడంలో అడ్డుగా ఉండే పాపాలు ఏమీ లేనివానినిగా నిన్ను చేస్తాను. దుఃఖించవద్దు.

8) నిశ్చిత్య త్వదధీనతాం మయి సదా కర్మాద్యుపాయాన్ హరే
కర్తుం త్యక్తుమపి ప్రపత్తు మనలం సీదామి దుఃఖాకులః ।
ఏతత్ జ్ఞానముపేయుషో మమ పునః సర్వాపరాధక్షయం
కర్తాసీతి దృఢోఽస్మి తే తు చరమం వాక్యం స్మరన్ సారథేః ॥

ఓ హరీ! నేను సదా నీకే అధీనమైన స్వరూప స్థితిప్రవృత్తులను కలవాడననే విషయాన్ని నిశ్చయించుకొని, కర్మయోగం మొదలైన ఉపా యాలను అనుష్ఠించడానికి, విడువడానికి, ప్రపత్తి చేయడానికి అసమర్థుడనై చాలా దుఃఖపడుతున్నాను. పార్థసారథివి అయన నీవు పల్కిన చరమ(చివరి) వాక్యాన్ని (చరమశ్లోకాన్ని) స్మరించే వాడనై, "భగవానుడే ఉపాయం – అని నిశ్చయించుకోవడ మనే ఈ జ్ఞానాన్ని పొందిన వాడనైన నా అపరాధాలను అన్నిటిని క్షయింపజేసేవాడవుగా నీవు కాగలవు" – అని నమ్మి, దుఃఖాన్ని లేనివాడనై, నిర్భయంగా ఉన్నాను.





## జితంతాస్తోత్రమ్

(ఈ స్తుతి ఋగ్వేదానికి చెందిన ఖిలభాగంగా చెప్పబడుతున్నది. శరణాగతి తత్త్వాన్ని నిరూపించే ఈ స్తుతిని ప్రతిదినం భగవదారాధన చివరలో చెప్పుకోవడం పెద్దల అలవాటు)

1. జితం తే పుండరీకాక్ష ! నమస్తే విశ్వభావన ! ।
నమస్తేఽస్తు హృషీకేశ ! మహాపురుష ! పూర్వజ ॥

పుండరీకాక్షా! నీకు జయం. ప్రపంచాన్ని సంకల్పమాత్రంతో సృష్టించేవాడా ! నీకు నమస్కారం. ఇంద్రియాలకు అధిపతి అయినవాడా ! నీకు నమస్కారం. మహా పురుషా! అందరికంటే ముందున్నవాడా ! నీకు నమస్కారం.

2. దేవానాం దానవానాం చ సామాన్యమధిదైవతమ్ ।
సర్వదా చరణద్వంద్వం వ్రజామి శరణం తవ ॥

దేవతలకు, దానవులకుకూడా సామాన్యమైన దైవమైన నీ చరణాలను రెండిటిని సదా శరణు పొందుతున్నాను.

3. ఏక స్త్వమసి లోకానాం స్రష్టా సంహారక స్తథా ।
అధ్యక్ష శ్చానుమంతా చ గుణమాయా సమావృతః ॥

లోకాలను సృష్టించేవాడవు నీవొక్కడివే. ఆ రీతిలోనే, సంహరించేవాడవుకూడా నీవే. అన్నిటిని గమనించి చూచేవాడవు, అన్నిటిని అనుమతించేవాడవు నీవే. సత్త్వ రజస్తమోమయమైన ప్రకృతిచే ఆవరింపబడడంచేత నీవు సృష్టిస్థితిలయకారకుడవని సరిగా గ్రహించలేక, వేఱెవ్వరో కారణమని అనడం తగినది కాదు.

4. సంసారం సాగరం ఘోర మనంతక్లేశభాజనమ్ ।
త్వామేవ శరణం ప్రాప్య నిస్తరంతి మనీషిణః ॥

నీ అనుగ్రహంవల్ల యథార్థజ్ఞానాన్ని పొందిన గొప్ప జ్ఞానులు నిన్నే శరణంగా ఆశ్రయించి, ఘోరమైనది, లెక్కలేనన్ని క్లేశాలకు నిలయమైనది అయిన సంసార సాగరాన్ని సుఖంగా దాటుతున్నారు.

5. న తే రూపం నా చాకారో నాయుధాని న చాస్పదమ్ ।
తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే ॥

నీకు ఉండే రూపం, ఆకారం (స్వరూపస్వభావాలు), ఆయుధాలు, స్థానం– ఇవి ఏమీ నీకోసం కాదు. అయినా, భక్తులకోసం నీవు పురుషాకారుడవై ప్రకాశిస్తున్నావు.

**6. నైవ కించిత్ పరోక్షం తే ప్రత్యక్షోఽసి న కస్యచిత్ ।**
**నైవ కించిదసిద్ధం తే న చ సిద్ధోఽసి కస్యచిత్ ॥**

నీకు ఏదీ పరోక్షం కాదు. నీవు ఎవ్వరికి వారి ఇంద్రియాలకు ప్రత్యక్షం కావు. నీకు సిద్ధించనిది – పొందలేనిది – ఏదీ లేదు. నీవు ఎవ్వరికి నీ దయ లేకుండా పొంద డానికి సాధ్యమైనవాడవు కావు.

**7. కార్యాణాం కారణం పూర్వం వచసాం వాచ్యముత్తమమ్ ।**
**యోగానాం పరమాం సిద్ధిం పరమం తే పదం విదుః ॥**

నీవు వేంచేసి ఉండే పరమపదాన్ని – అన్ని కార్యాలకు ముందుండే కారణంగా (ఈలోకంలో ఉండేవానివలె ఉత్పత్తి వినాశాలు లేనిదిగా), వాక్కులకన్నిటికి ఉత్తమమైన అర్థంగా, యోగాలకు అన్నిటికి గొప్ప సిద్ధిగా (ఫలంగా), జ్ఞానులు తెలిసికొంటున్నారు.

**8. అహం భీతోఽస్మి దేవేశ ! సంసారేఽస్మిన్ భయావహే ।**
**పాహి మాం పుండరీకాక్ష ! న జానే శరణం పరమ్ ॥**

దేవతలందఱికి అధిపతి అయినవాడా! భయాన్ని కల్గించే ఈ సంసారాన్ని చూచి నేను చాలా భయపడుతున్నాను. పుండరీకాక్షా! నన్ను కాపాడు. నీకంటే వేఱొక దిక్కు ఏదీ లేదు.

**9. కాలేష్వపి చ సర్వేషు దిక్షు సర్వాసు చాచ్యుత! ।**
**శరీరే చ గతౌ చాపి వర్తతే మే మహద్భయమ్ ॥**

ఓ అచ్యుతా! అన్ని కాలాలలోను, అన్ని దిక్కులలోను, శరీరంలోను జీవన గతిలోను అంతటా నాకు చాలా గొప్ప భయం కల్గుతున్నది.

**10. త్వత్పాదకమలాదన్యన్న మే జన్మాంతరేష్వపి ।**
**నిమిత్తం కుశలస్యాస్తి యేన గచ్ఛామి సద్గతిమ్ ॥**

నేను, దేనివల్ల మంచి గతిని పొందగలనో, ఆ కుశలానికి కారణమైనది నీ పాదపద్మమే. దానికంటే కారణం ఈ జన్మలోనే కాదు; వేఱొక జన్మలో కూడా లేదు.

**11. విజ్ఞానం యదిదం ప్రాప్తం యదిదం స్థాన మార్జితమ్ ।**
**జన్మాంతరేఽపి మే దేవ! మాభూత్తస్య పరిక్షయః ॥**

దేవా! ఈజన్మలో నేను పొందిన ఈ యథార్థజ్ఞానం, ఆర్జించిన స్థితి వేఱొక జన్మలో కూడా పొందాలి. మఱు జన్మలలో వాటికి లోపం కలుగకూడదు.



**12. దుర్గతావపి జాతాయాం త్వద్గతో మే మనోరథః ।**
**యది నాశం న విందేత తావతాస్మి కృతీ సదా ॥**

నాకు దుర్గతి కల్గినప్పటికీ, నీపట్ల నాకు గల మనోరథం (భక్తి), నశించకపోతే చాలు. అంత మాత్రంతో నేను ఎల్లప్పుడూ కృతకృత్యుడను కాగలదు.

**13. నా కామకలుషం చిత్తం మమ తే పాదయోః స్థితమ్ ।**
**కామయే వైష్ణవత్వం తు సర్వజన్మసు కేవలమ్ ॥**

నీ శ్రీచరణాలలో లగ్నమైన నా మనస్సు కోరికలచేత కలుషితమైనది కాదు. అన్ని జన్మలలోను నేను వైష్ణవుడను (విష్ణుభక్తిని కలవాడను) కావాలని కోరుకొంటున్నాను.

**14. సర్వేషు దేశకాలేషు సర్వావస్థాసు చాచ్యుత! ।**
**కింకరోఽస్మి హృషీకేశ ! భూయో భూయోఽస్మి కింకరః ॥**

అచ్యుతా! అన్ని దేశాలలో అన్ని కాలాలలో, అన్ని అవస్థలలోను నీకు నేను సేవకుడను. హృషీకేశా! ఈ విధంగా నీకు నేను మాటిమాటికి కింకరుడనై అన్ని కాలాలలో అన్ని చోట్ల అన్ని అవస్థలలో అన్ని విధాలైన కైంకర్యాలను మాటిమాటికి చేస్తాను.

**15. ఇత్యేవమనయా స్తుత్యా స్తుత్వా దేవం జనార్దనమ్ ।**
**కింకరోఽస్మీతి చాత్మానం దేవాయైె తం నివేదయత్ ॥**

ఈ విధంగా ఈవిధమైన స్తుతితో భగవానుని ప్రతిదినం స్తుతించి, 'కింకరుడను అయ్యాను' – అని తలుస్తూ భగవానునకు ఆత్మనివేదన చేసికోవాలి.

**16. యచ్చాపరాధం కృతవాన్ అజ్ఞానాత్ పురుషోత్తమ! ।**
**మద్భక్త ఇతి దేవేశ ! తత్ సర్వం క్షంతు మర్హసి ॥**

పురుషోత్తమా! దేవదేవా ! అజ్ఞానవశంచేత నేను చేసిన అపరాధాలను చూచి కోపించకుండా, "వీడు నా భక్తుడు" అని తలచి, వానిని అన్నిటిని నీవు క్షమించు.

**17. అహంకారార్థకామేషు ప్రీతి రద్యైవ నశ్యతు ।**
**త్వాం ప్రపన్నస్య మే దేవ ! వర్ధతాం శ్రీమతి త్వయి ॥**

దేవా! "నేను అధికుడను; నాకంటే గొప్పవారెవరూ లేరు"– అనే అహంకారంలో, ధనకాంక్షలో ప్రీతి నాకు ఇపుడే నశించాలి. నిన్ను శరణు పొందిన నాకు మంగళ కరుడవైన నీపట్ల ప్రీతి దినదినాభివృద్ధి పొందాలి.

18. **క్వాహ మత్యంతదుర్బుద్ధిః క్వచాత్మహితవీక్షణమ్ ।**
**యద్ధితం మమ దేవేశ ! తదాజ్ఞాపయ మాధవ ! ॥**

దేవేశా! లక్ష్మీపతీ! మిక్కిలి దుర్బుద్ధిని కల నేనెక్కడ? ఆత్మహితాన్ని గూర్చిన ఆలోచన, దానిని కల్గించే నీ సందర్శనం ఎక్కడ ? నాకు ఏది హితమో, అది నాకు తెలియదు. దానిని నీవే ఆజ్ఞాపించు.

19. **సోఽహం తే దేవదేవేశ ! నార్చనాదౌ స్తుతౌ న చ ।**
**సామర్థ్యవాన్ కృపామాత్రమనోవృత్తిః ప్రసీద మే ॥**

సకలజగదీశ్వరీశ్వరా ! దేవా ! పూర్వం తెల్పిన రీతిలో నేను నిన్ను అర్చించడంలో, స్తుతించడంలో సమర్థుడను కానేకాను. నాపట్ల కృపతో కూడిన మనోవ్యాపారాన్ని కలవాడవై నన్ను అనుగ్రహించు.

20. **ఉపచారాపదేశేన కృతాన్ అహరహర్మయాన్ ।**
**అపచారా నిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ! ॥**

పురుషోత్తమా! ఉపచారాలనే బుద్ధితో ప్రతిదినం నేను చేసిన ఈ అన్ని అపచారాలను నీవు క్షమించు.

# చతుఃశ్లోకి

(నాల్గు శ్లోకాలను కల ఈ లక్ష్మీస్తుతిని శ్రీయామునాచార్యులవారు రచించారు. ఇందులో లక్ష్మీవైభవం తెలుపబడింది. ప్రతిదినం ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది)

**కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం**
**వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ ।**
**బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**
**శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్ ॥ 1 ॥**

కల్యాణగుణాలను నిండుగా ఉన్నదానా! పురుషోత్తముడైన భగవానుడు నీకు ప్రియమైన పతి. సర్పరాజు అయిన ఆదిశేషుడు పడుక. వేదాన్ని శరీరంగా కలవాడు పక్షిరాజు అయిన గరుత్మంతుడు నీకు ఆసనంగాను, వాహనంగాను ఉన్నాడు. జగత్తును మోహింపజేసే ప్రకృతి నీముఖానికి తెరగా ఉన్నది. తమ భార్యతో కూడి ఉండే బ్రహ్మ, శివుడుమొదలైన దేవ సమూహం నీకు దాసగణంగా, దాసీగణంగా ఉన్నది. నీ పేరుకూడా "శ్రీః" అనియే. అటువంటి మహిమనుకల నిన్నుగూర్చి అజ్ఞులమైన మేము ఏవిధంగా చెప్పగలము?



**యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః**
**నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః ।**
**తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః**
**లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాంతే! దయాం తే విదన్ ॥ 2 ॥**

లోకానికి ఈశ్వరిగా ఉన్నదానా! లోకాలకు అన్నిటికీ స్వామి అయిన భగవానునకు ప్రియమహిషి అయినదానా! కరుణాస్వరూపిణీ! అంతు లేనిది సహజంగానే భగవానునకు సదా అనుకూలంగా ఉన్నది అయిన నీ గొప్పతనాన్ని ఈశ్వరుడైన నీవల్లభుడు కూడా తన గొప్పతనాన్ని వలె ఇంతటిది అని పరిచ్ఛేదించలేదు. అటువంటి నిన్ను దాసుడను, శరణు పొందినవాడను. నీ కరుణను తెలిసే నేను భయం లేనివాడనై స్తుతిస్తాను.

**ఈషత్ త్వత్కరుణా నిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే**
**నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్ ।**
**శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే**
**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥ 3 ॥**

నీ కటాక్షం పొందనందువల్ల పూర్వం నశించి పోయిన ముల్లోకాలు ఇపుడు, కొంచెం నీ కరుణాకటాక్షం అనే అమృతవర్షం కురవడంవల్ల అంతులేని గొప్పతనాన్ని కలిగి ఉండేటట్లుగా రక్షింపబడు తున్నది మానవులకు ఐశ్వర్య-కైవల్య-పరమపదాలలో శ్రేయస్సు, పుండరీకాక్షుని మనస్సుకు ప్రియురాలవు అయిన నీయొక్క అనుగ్రహం లేకుండా ఏనాడూ కలుగదుకదా!

**శాంతానందమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః**
**మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్ ।**
**యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి తాని**
**ఆహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే ॥ 4 ॥**

షడూర్మలను లేనిదై, ఆనందమయమై, గొప్ప విభూతులను కల్గినదై, తనకంటె గొప్పది వేఱొకటి లేనిదై, పెద్దదై ఉన్నందున, (ఇతరులను) పెద్దదిగా చేసినందువల్ల

బ్రహ్మశబ్దంచే చెప్పదగినదై ఉండే హరియొక్క ఏ స్వరూపం ఉన్నదో, దానికంటె ఆ భగవానునకు చాలా ప్రియంగా ఉండేది, కంటితో దర్శించదగినది, బ్రహ్మశబ్దంచే వ్యవహరింపబడేది, మిక్కిలి అద్భుతం అయినది అయిన ఏ రూపం ఉన్నదో, ఇష్టం వచ్చినట్లు విహరించే భగవానునకు మిగిలిన ఏ రూపాలు, ఉన్నవో ఆ స్వరూపరూపాలన్నీ నీకు అసాధారణాలై, తగినవై ఉండే దివ్యరూపాలతో గాఢంగా కలసి ఉన్నవి – అని ప్రమాణాలు చెబుతున్నవి.

# లక్ష్మీ శరణాగతి

( శరణాగతి గద్యలో శ్రీరామానుజులు చేసిన లక్ష్మీప్రపత్తి. దీనిని ఆరాధన చివరలో చెప్పుకోవడం సదాచారం.)

**ఓమ్. భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసఙ్ఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవనాలయాం, భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవదివ్య మహిషీమ్, అఖిలజగన్మా తరమ్, అస్మన్మాతరమ్, అశరణ్యశరణ్యామ్, అనన్యశరణ శ్శరణమహం ప్రపద్యే.**

జ్ఞానశక్తిబలైశ్వర్యాది సకలకల్యాణగుణ పరిపూర్ణుడైన నారాయణునకు ఇష్టం గాను, తగినవిగాను ఉండే స్వరూపం, విగ్రహం, విగ్రహ గుణాలు, విభూతులు– అనే వీటిని ఐశ్వర్యం, సౌశీల్యం మొదలైన ఎల్ల లేని గొప్పతనాన్ని కల లెక్కలేనన్ని కల్యాణగుణాల సమూహాలను కల్గినది, కమలవనాన్ని వాసస్థానంగా కల్గినది, గొప్ప కాంతితో నిండిన రూపాన్ని కల్గినది, (భగవానుని) ఏనాడూ విడిచిపెట్టి ఉండనిది, (దోషాలను లేనిది) పరిశుద్ధిని కల్గినది, దేవాధిదేవుడైన భగవానుని దివ్యమహిషి, అన్నిలోకాలకు తల్లి, (విశేషించి) మాకు తల్లి, ఏ దిక్కు లేనివారి గొప్ప దిక్కు అయిన లక్ష్మిని (శ్రీరంగ నాయకిని) వేఱు గతి లేనివాడనైన నేను శరణు పొందుతున్నాను.



శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# శ్రీస్తవం

(ఈ స్తుతిని ఉదయం ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది.)

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గలసూత్రతామ్ ॥**

1. **స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః**
**స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః ।**
**యస్యా వీక్ష్య ముఖం తదిఙ్గితపరాధీనో విధత్తేఖిలం**
**క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాదైకరస్యాత్తయా ॥**

సమస్తలోకాల సృష్టిసంహారరక్షణాలు, స్వర్గమోక్షప్రదానాలు మొదలైనవానిని అన్నిటినీ హరి అనబడే శ్రీమన్నారాయణుడు ఏ శ్రీదేవియొక్క ముఖాన్ని చూచి, ఆమె కనుబమల కదలికల సూచనలకు పరతంత్రుడై చేస్తున్నాడో, ఆవిధంగా కాకపోతే, శ్రీ హరి ఆ శ్రీదేవితో ఐకరస్యాన్ని కలవాడు కనుక ఈ సృష్ట్యాది క్రీడ అతనికి ఆనందాన్ని ఇచ్చేది కాదో, అటువంటి శ్రీదేవి అన్నిలోకాలకు శుభాన్ని కల్గించుగాక.

2. **హే శ్రీ ర్దేవి ! సమస్తలోకజననీం త్వాం స్తోతు మీహామహే**
**యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియమ్ ।**
**భక్తిం భన్ధయ నన్దయాశ్రిత మిమం దాసం జనం తావకం**
**లక్ష్యం లక్ష్మి ! కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీ వయమ్ ॥**

ఓ శ్రీదేవీ! (అందఱిచే ఆశ్రయింపబడుతూ, భగవానుని ఆశ్రయిస్తూ ఉన్న తల్లీ!) క్రీడాదిగుణవిశిష్టురాలా! దేవీ! మేము లోకాలకు అన్నిటికీ తల్లివి అయిన నిన్ను స్తుతించాలని ప్రయత్నిస్తున్నాము. ఆ స్తుతికి తగిన వాక్కును మాకు అనుగ్రహించు. నీ పట్ల ప్రీతిని ప్రధానంగా కల బుద్ధిని మాకు వర్ధిల్లచేయి. నిన్ను ఆశ్రయించిన, నీకు చెందినవాడనైన ఈ దాసుని (నన్ను) సంతోషపెట్టు. మేము నీ కటాక్షాలనబడే కెఱటాల పొంగుకు లక్ష్యంగా కావాలి.

3. **స్తోత్రం నామ కిమామనన్తి కవయో యద్యన్యదీయాన్గుణాన్**
**అన్యత్ర త్వసతోధిరోప్య ఫణితి స్సా తర్హి వన్ధ్యా త్వయి ।**

**సమ్యక్సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ**
**వాగ్వాచస్పతినాపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥**

కవులు స్తోత్రమని దేనిని అంటున్నారు? ఒకరిలో లేనివి, ఇంకొకరిలో ఉన్నవి అయిన గుణాలను లేనివారిలో ఆరోపించి చెప్పడమే స్తోత్రం అయితే, ఆ విధంగా స్తుతించడం సమస్తకల్యాణగుణనిధివి అయిన నీ విషయంలో దుస్సాధం. ఎందుకంటే, నీలో లేని సద్గుణం అన్నది లేదుకదా! ఇక విధంగా కాకుండా ఉన్నగుణాలను ఉన్నట్లు చక్కగా వర్ణించడమే స్తుతి అని అంటే, సద్గుణసముద్రడవు అయిన నీ విషయంలో అటువంటి స్తుతిని పూర్ణంగా చేయడం బృహస్పతికికూడా ఏ విధంగా సాధ్యం? సాధ్యం కాదుకదా!

4. **యే వాచాం మనసాం చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణా స్తావకాః**
**తానేవ ప్రతి సామ్బుజిహ్వా ముదితా హై మామికా భారతీ ।**
**హాస్యం తత్తు న మన్మహే న హి చకోర్యేకాఖిలాం చన్ద్రికాం**
**నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి ॥**

నీకు సంబంధించిన ఏయే గుణాలు వాక్కులకు, మనస్సుకుకూడా గ్రహించడానికి సాధ్యం కానివిగా ప్రసిద్ధిజెందాయో, వాటిని నా వాక్కు రసం ఊటే జిహ్వతో (ఆనందంగా) వర్ణించాలని ప్రవర్తిస్తున్నది. ఎంత ఆనందం ! ఇటువంటి ప్రయత్నం పరిహాసాస్పదం అని మేము అనుకోము. ఎందుకంటే, ఆడచకోరపక్షి తనకు దాహం కల్గినపుడు వెన్నెలను అంతటినీ నేను తాగలేనుకదా అని భావించి, నాలుకను ముదుచుకొని ఊరికే ఉండలేదుకదా !

5. **క్షోదీయా నపి దుష్టబుద్ధి రపి నిస్స్నేహోప్యనీహోపి తే**
**కీర్తిం దేవి! లిహ న్నహం న చ బిభేమ్యజ్ఞో న జిహ్రేమి చ ।**
**దుష్యేత్ సాతు న తావతా న హి శునా లీఢాపి భాగీరథీ**
**దుష్యేత్ శ్వాపి న లజ్జతే న చ బిభేత్యార్తి స్తు శామ్యే చ్ఛునః ॥**

దేవీ! ఏమీ తెలియని అజ్ఞుడనైన నేను చాలా నీచుడను అయినా, దుష్టబుద్ధిని అయినా, భక్తి లేనివాడను అయినా, ఏవిధమైన మంచి ప్రయత్నాన్ని లేనివాడను అయినా, నీకీర్తిని నోరారా స్తుతించడంద్వారా ఆనందం అనుభవిస్తూ ఏమాత్రం భయపడడం లేదు. సిగ్గుపడడమూ లేదు. నాచే వర్ణింపబడే నీ కీర్తి నా చేత కీర్తింపబడినంతమాత్రంచేత చెడిపోదు. ఏవిధంగా అంటావా – గంగాతీర్థం కుక్కచేత స్పృశింపబడినా (నాకబడినా) చెడిపోదు కదా! దాని పవిత్రతకు భంగం రాదుకదా ! ఆ కుక్కకూడా గంగాజలాన్ని



స్పృశించడానికి సిగ్గుపడడం లేదు. భయపడడమూ లేదు. కాని, ఆ కుక్క దాహం మాత్రం శాంతిస్తుందికదా !

6. **ఐశ్వర్యం మహ దేవ వాల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్**
**తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే ।**
**తేనైతేన న విస్మయేమహి జగన్నాథోపి నారాయణో**
**ధన్యం మన్యత ఈక్షణా త్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః ॥**

మానవులకు ఈలోకంలో, పైలోకంలో అన్నిచోట్ల లభించే ఐశ్వర్యం అది కొంచెంగా అయినా, ఎక్కువగా అయినా, నీ కటాక్షంవల్లనే కలుగుతున్నది. అటువంటి ఈ నీ కటాక్షాన్ని చూచి మేము ఏమీ ఆశ్చర్యపడడం లేదు. ఎందుకంటే, జగన్నాథుడు, తనకు తానే ప్రభువు అయిన శ్రీమన్నారాయణుడుకూడా నీకటాక్షంవల్లనే తనను ధన్యునిగా భావిస్తున్నాడు.

7. **ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌన్దర్యలావణ్యయోః**
**రూపం యచ్చ హి మఙ్గళం కి మపి యల్లోకే సదిత్యుచ్యతే ।**
**తత్సర్వం త్వదధీన మేవ యదత శ్శ్రీ రిత్యభేదేన వా**
**యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే ॥**

ఓ లక్ష్మీదేవీ! చేతనులందఱివద్ద ఉండే సంపద కాని, అవయవశోభ అనే సౌందర్యం కాని, సముదాయశోభ అయిన లావణ్యం కాని, లోకంలోని మంగళమనే పేరు కల్గినది కాని, ఇంకా సచ్ఛబ్దవాచ్యమైనది మంచిది ఏదయినా కాని, ఆ ఐశ్వర్యం మొదలైనవి అన్నీ నీ ఆజ్ఞకు అణగినవై ఉన్నాయి. అందువల్ల అవి అంతా **"శ్రీ"** అని అభేదనిర్దేశంతో గాని, లేక, **"శ్రీమత్"** అనే పదంతో కాని ప్రసిద్ధిని పొందుతున్నవి.

8. **దేవి! త్వన్మహిమావధి ర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే**
**యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే ।**
**యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః**
**వ్యోమామ్భోజ మిదన్తయా కిల విదన్ భ్రాన్తోఽయ మిత్యుచ్యతే ॥**

ఓ దేవీ! నీ మహిమయొక్క అవధిని తెలియడం హరికికూడా సాధ్యం కాదు. నీవల్లనూ కాదు. ఈవిధంగా నీమహిమ ఎవరికీ తెలియరానిది అయినా మీ ఇద్దఱి సర్వజ్ఞత్వానికి భంగం ఏమాత్రం రాదు. ఎందుకు? అని అంటే, ఏవస్తువు లోకంలో బత్తిగా అసలు లేనే లేదో, ఆ అసద్వస్తువును తెలియకుండా ఉండడం అన్నది

సర్వజ్ఞత్వానికి అనుగుణమని తెలివైనవారు అంటారు. (లేనిదానిని ఉన్నదని తెలియడం భ్రాంతి. కనుక లేనిదానిని లేనిదిగా తెలియడం సర్వజ్ఞత్వమే అవుతుంది.) ఆకాశపద్మం ఇటువంటిది అని ఎవడైనా తెలిసికొంటే వాడు భ్రాంతుడని అనబడుతున్నాడుకదా!

**9. లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం**
**యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి।**
**సా భారతీ భగవతీ తు యదీయదాసీ**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః॥**

లోకంలో ఒకడు వృక్షంవలె జడుడై పుట్టడం, ఒకడు బృహస్పతివలె మహా విద్వాంసుడై పుట్టడం – అనే హెచ్చు తగ్గులు ఏ సరస్వతీదేవికటాక్షంయొక్క ఫలంగా చెబుతున్నారో, భగవతి అయిన ఆ సరస్వతికూడా లక్ష్మీదేవికి దాసురాలు. అటువంటి దేవదేవుని మహిషి అయిన శ్రీదేవిని నేను ఆశ్రయిస్తున్నాను.

**10. యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన**
**సద్య స్సముల్లసితపల్లవ ముల్లలాస।**
**విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః॥**

ప్రళయకాలంలో ఏ లక్ష్మీకటాక్షం లేనందువల్ల వాడిపోయిన (నిశ్శ్రీకమైన) జగత్తు ఆ లక్ష్మీదేవి కటాక్షాల ప్రసరణం (అనే సంకల్పం) కాగానే మఱుక్షణంలో చిగిర్చి వృద్ధిచెందిందో అటువంటి దేవదేవదివ్యమహిషి అయిన శ్రీదేవిని ఆశ్రయిస్తున్నాము.

**11. యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశా స్స్యుః।**
**శ్రీరంగరాజమహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః॥**

ఏ లక్ష్మీదేవియొక్కకటాక్ష వీక్షణాలకు క్షణకాలం లక్ష్యమైనవారుకూడా గొప్ప సంపదను కలవారు (మహేశ్వరునివంటివారు) అవుతున్నారో, శ్రీరంగనాథుని పట్టమహిషి అయిన ఆ లక్ష్మి నన్నుకూడా కటాక్షించాలి.

శ్రీస్తవం సంపూర్ణము.



# గోదాచతుఃశ్లోకి

(ఈ స్తుతిని అనంతార్యులు రచించారనే ప్రసిద్ధి ఉన్నది. ఇది నిత్యానుసంధేయం.)

**1) నిత్యా భూషా నిగమశిరసాం నిస్సమోత్తుంగవార్తా**
**కాంతో యస్యాః కచవిలులితైః కాముకో మాల్యరత్నైః ।**
**సూక్త్యా యస్యాః శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ**
**సైషా దేవీ సకలజననీ సించతాం మామపాంగైః॥**

ఏ గోదాదేవి పల్కిన సాటి లేని గొప్ప సూక్తి (తిరుప్పావై) వేదాంతాలకు నిత్యమైన భూషణమో (వేదాంతార్థాలకు శోభను కల్గించిందో), ఏ గోదాదేవి తన కేశాలలో ముడుచుకొని తీసి ఇచ్చిన గొప్ప పూమాలికలచేత భగవానుడు ఆకర్షింపబడి ఆమెపట్ల అనురాగాన్ని కలవాడయ్యాడో, చెవులకు ఇంపైన ఎవరి సూక్తిచేత (తిరుప్పావై ప్రబంధంచేత) ధరిత్రి ప్రబోధాన్ని పొందుతున్నదో, అటువంటి, సకలలోక జనని అయిన ఈ గోదాదేవి నన్ను తన కటాక్షంతో తడపుగాక (అనుగ్రహించుగాక).

**2) మాతా చేత్ తులసీ పితా యది తవ శ్రీవిష్ణుచిత్తో మహాన్**
**భ్రాతా చేత్ యతిశేఖరః ప్రియతమః శ్రీరంగధామా యది।**
**జ్ఞాతార స్తనయా త్వదుక్తిసరసస్తన్యేన సంవర్ధితాః**
**గోదాదేవి! కథం త్వమన్యసులభా సాధారణా శ్రీరసి॥**

గోదాదేవీ! నీ తల్లి తులసి. తండ్రి మహానుభావుడైన విష్ణుచిత్తుడు. నీ సోదరుడు యతిరాజు. నీ ప్రియతముడు (భర్త) శ్రీరంగనాథుడు. నీ పుత్రులు నీ సరసమైన సూక్తి అనే పాలతో వర్ధిల్లిన జ్ఞానులు. అందువల్ల నీవు అనన్యసులభవు, అసాధారణ వనితవు (చాలా గొప్పదానవు).

**3) కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్టేన సర్వాత్మనా**
**ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్।**
**సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యే పురే**
**జాతాం వైదిక విష్ణుచిత్తతనయాం గోదా ముదారాం స్తుమః॥**

కల్పారంభంలో, సకలలోకాలకు ఆత్మ అయిన హరి లోకహితాన్ని కోరి స్వయంగా తనను కీర్తించడం, శరణాగతి చేయడం, తనకు పూవులను అర్పించడం మొదలైన

ఉజ్జీవనగతులను ఉపదేశించాడు. వాటిని అన్నిటిని నిత్యం అనుష్ఠించి వ్యక్తం చేయడంకోసం శ్రీవిల్లిపుత్తూరులో వైదికులైన విష్ణుచిత్తుల పుత్రికగా ఆవిర్భవించిన, ఉదారస్వభావాన్ని కల గోదాదేవిని స్తుతిస్తున్నాను.

4) **ఆకూతస్య పరిష్క్రియా మనుపమా మాసేచనం చక్షుషో**
**ఆనందస్య పరంపరా మనుగుణా మారామశైలేశితుః ।**
**తద్దోర్మధ్య కిరీటకోటిఘటిత స్వోచ్ఛిష్టకస్తూరికా**
**మాల్యామోద సమేధితాత్మవిభవాం గోదా ముదారాం స్తుమః ॥**

గోదాదేవి, ఉద్యానవనాలను కల తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుని స్వామియొక్క అభీష్టానికి పరిష్కారం, ఆ స్వామినేత్రాలకు సాటిలేని తృప్తిని కల్గిస్తున్నది. ఆ స్వామి వక్షఃస్థలం, కిరీటం అగ్రభాగం ఆమె ముడుచుకొని తీసి ఇచ్చిన కస్తూరికామాలికతో అలంకరింపబడ్డాయి. ఆ మాలిక ఆమోదంతో (**"సర్వగంధః"** అని అన్ని సుగంధాలను కలవాడుగా, **"ఏష హ్యేవానంద యాతి"** అని అందరిని ఆనందింపజేసే వాడుగా చెప్పబడే భగవానునకు అపూర్వమైన సుగంధాన్ని, ఆనందాన్ని కల్గించడం ద్వారా) గోదాదేవి వైభవం మిక్కిలిగా వృద్ధిచెంది ప్రకాశిస్తున్నది. ఇటువంటి మహనీయురాలైన గోదాదేవిని స్తుతిస్తున్నాము.

**స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధురజిష్ణవే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**

# పరాంకుశాష్టకమ్

(ఇది నమ్మాళ్వార్ల స్తుతి. దీనిని ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది)

1. **త్రైవిద్యవృద్ధజనమూర్ధ విభూషణం యత్**
**సంపచ్చ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్ ।**
**యద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం**
**తత్ సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్ ॥**

వేదార్థాలను తెలిసినవారిలో ప్రముఖులైనవారి శిరస్సులకు ఆభరణం, సాత్త్వికజనులకు నిత్యమైన సంపద, ఏ గతి లేనివారికి గొప్ప గతి, పరమపవిత్రమైన qeÖళ్వార్ల శ్రీచరణాలను రెండిటిని ఆశ్రయిస్తున్నాను.



2. **భక్తిప్రభావ భవదద్భుతభావబంధ–**
**సంధుక్షిత ప్రణయసార రసౌఘపూరః ।**
**వేదార్థరత్ననిధి రచ్యుతదివ్యధామ**
**జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా ॥**

ఆళ్వార్లు ఒక గొప్ప సముద్రం. ఆళ్వార్లకు కల్గిన స్త్రీభావన (సఖి–మాతృ–నాయకీభావనలు) భగవద్భక్తి ప్రభావంవల్ల కల్గినవి. ఆశ్చర్యాన్ని కల్గించే ఆ భావబంధాల అతిశయంవల్ల పుట్టిన ప్రణయభావమనే (అమృత) ప్రవాహంతో ఆళ్వార్లు అనే సముద్రం నిండి ఉన్నది. ఆళ్వార్లు అనే సముద్రంలో వేదార్థాలనే రత్నాలున్నాయి. ఆళ్వార్లు అనే ఈ సముద్రంలో కూడా అచ్యుతుడనబడే భగవానుడు నివసిస్తున్నాడు. ఈ ఆళ్వార్లు అనబడే సముద్రంకూడా గొప్ప మహిమను కల్గినది. ఇటువంటి ఆళ్వార్లు అనే సముద్రం నిత్యం వర్ధిల్లాలి.

3. **ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్ ।**
**సహస్రశాఖాం యోఽద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్ ॥**

ఆళ్వార్లకు శ్రీకృష్ణునిపై గల తృష్ణ, లేక, లోకసంరక్షణలో శ్రీకృష్ణునకు కల తృష్ణ– మూర్తీభవించినట్లున్నవారు, వేయి శాఖలను కల (సామవేదంతో సమానమైన) తిరువాయ్‌మొళ్ళి అనే ద్రావిడవేదాన్ని దర్శించినవారు, మహర్షి అయిన నమ్మాళ్వార్లను ప్రీతితో సేవిస్తాము.

4. **యద్గోసహస్ర మపహంతి తమాంసి పుంసాం**
**నారాయణో వసతి యత్ర సశంఖచక్రః ।**
**యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః**
**తస్మై నమో వకుళభూషణభాస్కరాయ ॥**

నమ్మాళ్వార్లు సూర్యునివంటివారు. సూర్యుడు వేయి కిరణాలను లోకంలో వ్యాపింపజేసి చీకటిని పోగొట్టేటట్లే, ఆళ్వార్లు (తిరువాయ్‌మొళ్ళి – అనే ప్రబంధంలోని) వేయి పాశురాలనే కిరణాలను లోకంలో వ్యాపింపజేసి, లోకుల అజ్ఞానమనే చీకటిని పోగొడుతున్నారు. సముద్రంలో శంఖచక్రధారి అయిన శ్రీమన్నారాయణుడు నిత్యవాసం చేసేటట్లే, నమ్మాళ్వార్ల హృదయంలో కూడా శ్రీమన్నారాయణుడు శంఖచక్రధారియై వేంచేసి ఉన్నాడు. సూర్యమండలాన్ని దర్శించిన విప్రులు (బ్రాహ్మణులు) చేతులెత్తి నమస్కరించినట్లే, నమ్మాళ్వార్లు అవతరించిన మండలాన్ని (కురుకాపురిని) విన్నపుడు,

లేక, వారు పల్కిన మండల (అన్దాది) ప్రబంధమైన తిరువాయ్‌మొ\ఝిని విన్నపుడు విజ్ఞులు చేతులెత్తి నమస్కరిస్తారు. అటువంటి గొప్ప సముద్రంవలె ఉండే నమ్మాళ్వార్లకు నమస్కారం.

**5. పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్తసార్వజ్ఞ్య సంపదమ్ ।**
**ప్రపన్నజనకూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశమ్ ॥**

శ్రియఃపతి అనుగ్రహంవల్ల సర్వజ్ఞత్వం – (అన్నిటినీ తెలిసికోవడం) అనే సంపదను పొందినవారు, ప్రపన్నులకులానికి మూలపురుషులైన శ్రీపరాంకుశమునిని (నమ్మాళ్వార్లను) శరణాగతి చేస్తున్నాను.

**6. శఠకోపమునిం వందే శఠానాం బుద్ధిదూషకమ్ ।**
**అజ్ఞానాం జ్ఞానజనకం తింత్రిణీమూలసంశ్రయమ్ ॥**

స్వరూపజ్ఞానం లేని, కుటిలబుద్ధిని కలవారి అజ్ఞానాన్ని పోగొట్టేవారు, జ్ఞానం లేనివారికి యథార్థజ్ఞానాన్ని కల్గించేవారు, ఏనాడూ నిద్రించని చింతచెట్టు మూలంలో నివసించేవారైన శఠకోపమునికి నమస్కరిస్తున్నాను.

**7. వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్ ।**
**యః శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥**

లోకానికి అద్వితీయమైన ఆభరణంవంటివారు, లోకహితాన్నిగూర్చి సదా ఆలోచించేవారు, వేదాంతార్థాలను ద్రావిడభాషలో (ద్రావిడప్రబంధాల రూపంలో) రచించినవారైన నమ్మాళ్వార్లకు నమస్కరిస్తున్నాను.

**8. వకుళాలంకృతం శ్రీమచ్ఛఠకోపపదద్వయమ్ ।**
**అస్మత్కులధనం భోగ్యమస్తు మే మూర్ధ్ని భూషణమ్ ॥**

వకుళపుష్పాలచే (పొగడపూలచే) అలంకరింపబడినది, గొప్పగా ప్రకాశిస్తున్నది, మా కులానికి ధనం, పరమభోగ్యమైనది అయిన నమ్మాళ్వార్ల పాదద్వయం నా శిరస్సుకు ఆభరణంగా కావాలి.

**9. నమజ్జనస్య చిత్తభిత్తిభక్తి చిత్రతూలికా**
**భవాహివీర్యభంజనే నరేంద్రమంత్రయంత్రణా ।**
**ప్రపన్నలోకకైరవ ప్రపన్నచారుచంద్రికా**
**శఠారిహస్తముద్రికా హఠాద్దునోదు మే తమః ॥**



తమకు నమస్కరించేవారి మనస్సులలో భక్తి అనే చిత్రాన్ని లిఖించే చిత్రలేఖిని వంటిది, సంసారమనే సర్పంయొక్క విషాన్ని పోగొట్టడంకోసం విషవైద్యుడు చేసే మంత్రప్రయోగయంత్రం వంటిది, ప్రపన్నుల మనస్సులకు ఆనందాన్ని కల్గించే అందమైన చంద్రికవంటిది అయిన నమ్మాళ్వార్ల ఉపదేశముద్ర నా అజ్ఞానాన్ని తొలగించాలి.

# ధాటీపంచకము

( భగవద్రామానుజులు వైభవాన్ని తెలిపే స్తుతి, ఇది. దీనిని దాశరథి అనబడే భగవద్రామానుజుల మేనల్లుడు, వారి శిష్యులు ముదలియాణ్డాన్ రచించారు. )

**1. పాషణ్డద్రుమషండ దావదహనః చార్వాకశైలాశనిః**
**బౌద్ధధ్వాంత నిరాసవాసరపతిః జైనేభకంఠీరవః ।**
**మాయావాది భుజంగభంగ గరుడః త్రైవిద్యచూడామణిః**
**శ్రీరంగేశజయధ్వజో విజయతే రామానుజోఽయం మునిః ॥**

పాషండద్రుమషండదావదహనః = పాషండమతస్థులనే వృక్షాలకు కార్చిచ్చు వంటివారు, చార్వాకశైలాశనిః = చార్వాకులనే పర్వతాలకు వజ్రాయుధం వంటివారు, బౌద్ధధ్వాంత = బౌద్ధులనే చీకటిని పోగొట్టే, వాసరపతిః = సూర్యునివంటివారు, జైనేభకంఠీరవః = జైనులనే మదగజాలకు సింహంవంటివారు, మాయావాది = మాయావాదులనబడే (అద్వైతులు), భుజంగభంగ = సర్పాలను భంగపరచే, గరుడః = గరుడుని వంటివారు, త్రైవిద్యచూడామణిః = పరమవైదికుల శిరస్సులను అలంకరించే చూడామణి వంటివారు, శ్రీరంగేశజయధ్వజః = శ్రీరంగనాథుని కీర్తికి ధ్వజపతాకంవంటివారు అయిన, అయం రామానుజః మునిః = ఈ భగవద్రామానుజమునులు, విజయతే= సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

**2. పాషండషండ గిరిఖండన వజ్రదండాః**
**ప్రచ్ఛన్నబౌద్ధ మకరాలయ మంథదండాః ।**
**వేదాంతసార సుఖదర్శనదీపదండాః**
**రామానుజస్య విలసంతి మునే స్త్రిదండాః ॥**

పాషండషండగిరిఖండన = పాషండమతస్థుల సమూహాలు అనే పర్వతాలను ఖండించడంలో, వజ్రదండాః = వజ్రదండంవంటివి, ప్రచ్ఛన్నబౌద్ధ = ముసుగు వేసికొన్న

బౌద్ధులుగా చెప్పబడే అద్వైతులనే, మకరాలయ = సముద్రానికి, మంథదండాః= మథించే కవ్వంవంటివి, వేదాంతసార = వేదాంతాలలోని సారాన్ని, సుఖదర్శన = సుఖంగా దర్శించడంలో, దీపదండాః = దివ్విటీలవంటివి అయిన, రామానుజస్య మునేః = భగవద్రామానుజమునుల, త్రిదండాః = త్రిదండం, విలసంతి = ప్రకాశిస్తున్నవి.

**3. చారిత్రోద్ధారదండం చతురనయపదాలంక్రియా కేతుదండం**
**సద్విద్యాదీపదండం సకలకలికథాసంహృతేః కాలదండమ్ ।**
**త్రయ్యంతాలంబదండం త్రిభువనవిజయ చ్ఛత్రసౌవర్ణదండం**
**ధత్తే రామానుజార్యః ప్రతికథకశిరోవజ్రదండం త్రిదండమ్ ॥**

చారిత్ర+ఉద్ధారదండం = చక్కని నడవడికను అలవాటు చేసి, వృద్ధిపొందించే బెత్తంవంటిది, చతుర నయపదాలంక్రియా కేతుదండం = వేదశాస్త్రమార్గాన్ని అలంకరించే ధ్వజస్తంభంవంటిది. సద్విద్యాదీపదండం = సద్విద్య మొదలైన బ్రహ్మవిద్యలను చక్కగా వ్యక్తం చేయ గల దీపదండంవంటిది, సకలకలికథాసంహృతేః కాలదండం= అన్ని విధాలైన కలికోలాహలాలను లేకుండా చేయగల యమదండంవంటిది, త్రయ్యంతాలంబదండం = వేదాంతాలకు ఆధారదండంవంటిది, త్రిభువన విజయచ్ఛత్ర సౌవర్ణదండం = ముల్లోకాలను జయించి నాటిన ఛత్రానికి సువర్ణస్తంభంవంటిది, ప్రతికథకశిరో వజ్రదండం = ప్రతివాదుల శిరస్సులను బ్రద్దలు చేయగల వజ్రదండం వంటిది అయిన, త్రిదండం = త్రిందడాన్ని, రామానుజార్యః ధత్తే = భగవద్రామానుజులు ధరించి ఉన్నారు.

**4. త్రయ్యా మాంగల్యసూత్రం త్రియుగపద యుగారోహణాలంబసూత్రం**
**సద్విద్యాదీపసూత్రం సకలకలికథా సంహృతేః కాలసూత్రమ్ ।**
**ప్రజ్ఞాసూత్రం బుధానాం ప్రశమధనమనఃపద్మినీనాళసూత్రం**
**రక్షాసూత్రం మునీనాం జయతి యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రమ్ ॥**

త్రయ్యామాంగల్యసూత్రం = వేదం అనే కాంతకు మంగళసూత్రంవంటిది, త్రియుగపదయుగారోహణాలంబసూత్రం = జ్ఞానం, శక్తి మొదలైన ఆఱు ముఖ్యగుణాలను కల షాడ్గుణ్యపూర్ణుడైన భగవానుని శ్రీపాదాలను ఆశ్రయించడానికి తగిన ఆలంబన సూత్రం వంటిది, సద్విద్యాదీపసూత్రం – సద్విద్య అనే (ఉపనిషద్విద్య) దీపానికి సూత్రం (వత్తి) వంటిది, సకలకలికథాసంహృతేః = అన్ని విధాలైన కలిపురుషుని కోలాహలాలను నిరసించే, కాలసూత్రం = యమపాశంవంటిది, బుధానాం ప్రజ్ఞాసూత్రమ్ = విద్వాంసుల మేధస్సును ప్రకాశింపజేసే మీమాంసాసూత్రంవంటిది, ప్రశమధనమనః పద్మినీనాళ సూత్రం = యోగుల చిత్తం అనే తామరతటాకంలోని తామరలకు ఆధారభూతం అయిన తూడు (నాళసూత్రం) వంటిది అయిన, యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రమ్ = శ్రీరామానుజుల వక్షఃస్థలంలోని యజ్ఞోపవీతం, జయతి = సర్వోత్కర్షతో వెలుగు తున్నది.



**5. పాషండసాగర మహాబడబాముఖాగ్నిః శ్రీరంగరాజచరణాంబుజ మూలదాసః ।**
**శ్రీవిష్ణులోకమణిమంటప మార్గదాయీ రామానుజో విజయతే యతిరాజరాజః ॥**

పాషండసాగర మహాబడబాముఖాగ్నిః = పాషండులనే మహాసముద్రాన్ని ఇంకింప జేసే బడబాగ్నివంటివారు, శ్రీరంగరాజ చరణాంబుజమూలదాసః = శ్రీరంగనాథుని శ్రీపాదపద్మాల మూలంలో దాసభూతులైనవారు, శ్రీవిష్ణులోక మణిమంటప మార్గ దాయీ= పరమపదంలోని తిరుమామణిమంటపం చేరడానికి మార్గాన్ని అనుగ్రహించే వారు, యతిరాజరాజః = యతిసార్వభౌములు అయిన, రామానుజః విజయతే = భగవద్రామానుజులు సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

# ప్రార్థనాపంచకము

(ఈ స్తుతి శ్రీరామానుజులను గూర్చి రచింపబడింది. దీన్ని రోజు చెప్పుకోవడం మంచిది.)

**1. యతీశ్వర! శ్రుణు శ్రీమన్! కృపయా పరయా తవ ।**
**మమ విజ్ఞాపన మిదం విలోక్య వరదం గురుమ్ ॥**

శ్రీమన్ = ఉభయవిభూతులను నిత్యంగా కల్గిన, యతీశ్వర! = యతులకు ఈశ్వరులైన శ్రీరామానుజా!, వరదం గురుమ్ = వరదులనే ఆచార్యులను, విలోక్య = కటాక్షించి, తవ పరయా కృపయా = మీకే అసాధారణం అయిన గొప్ప కృపతో, మమ= నాయొక్క, ఇదం విజ్ఞాపనమ్ = ఈ విన్నపాన్ని, శ్రుణు = ఆలకించు.

**2. అనాదిపాపరచితా మంతఃకరణనిష్ఠితామ్ ।**
**యతీంద్ర! విషయే సాంద్రాం వినిర్వాసయ వాసనామ్ ॥**

యతీంద్ర=యతిరాజా !, అనాదిపాపరచితాం = మొదలు తెలియని, చిరకాలంగా చేస్తున్న పాపాలచేత సంభవించినది, అంతఃకరణనిష్ఠితాం = అంతరింద్రియం అనే

మనస్సులో స్థిరంగా ఉండేది, విషయే = స్వరూపానికి తగని బాహ్యవిషయాలలోగల, సాంద్రాం = దట్టమైన, వాసనాం = సంగాన్ని, వినివర్తయ = తొలగించాలి.

**3. అపి ప్రార్థయమానానాం పుత్రక్షేత్రాదిసంపదమ్ ।**
**కురు వైరాగ్యమేవాత్ర హితకారిన్! యతీంద్ర నః ॥**

హితకారిన్ = హితాన్ని చేసే, యతీంద్ర = యతీశ్వరా!, పుత్రక్షేత్రాది సంపదమ్= పుత్రసంతానం, భూమి మొదలైన లౌకికసంపదను, ప్రార్థయమానానామ్ అపి = మీవద్ద దాసులమైన మేము ప్రార్థించినవారమైనా, నః = మాకు, అత్ర = ఈ పుత్రక్షేత్రాదుల విషయంలో, వైరాగ్య మేవ = విరక్తినే, కురు = కలుగజేయాలి.

**4. యథాపరాధాః న స్యు ర్మే భక్తేషు భగవత్యపి ।**
**తథా లక్ష్మణయోగీంద్ర! యావద్దేహం ప్రవర్తయ ॥**

లక్ష్మణయోగీంద్ర =శ్రీరామానుజయోగీంద్రా!, మే = (మీ) దాసుడనైన నాకు, భక్తేషు = భాగవతులపట్ల, భగవతి+ అపి = భగవానునిపట్లను, అపరాధాః = అపచారాలు, యథా న స్యుః తథా = కలగని రీతిలో, యావద్దేహం = దేహం ఉన్నంతకాలం, ప్రవర్తయ = నన్ను నడిపించాలి.

**5. ఆమోక్షం లక్ష్మణార్య! త్వత్ప్రబంధపరిశీలనైః ।**
**కాలక్షేపోఽ స్తు న స్సద్భి స్సహవాస ముపేయుషామ్ ॥**

లక్ష్మణార్య = శ్రీరామానుజార్యా !, ఆమోక్షం =మోక్షాన్ని పొందేంతవరకు, నః = దాసులమైన మాకు, సద్భిః = సత్పురుషులతో, సహవాసం = కలసి నివసించడాన్ని, ఉపేయుషాం (సతాం) = పొందినవారమై, త్వత్ ప్రబంధ పరిశీలనైః = తాము అనుగ్రహించిన సద్గ్రంథాలను పరిశీలనచేయడం ద్వారా, కాలక్షేపః = పొద్దును సరి అయిన రీతిలో నడపడం, అస్తు = కలుగుగాక.

**6. పరాంకుశ మునీంద్రాది పరమాచార్యసూక్తయః ।**
**స్వదంతాం మమ జిహ్వాయై స్వత ఏవ యతీశ్వర ! ॥**

యతీశ్వర = యతిరాజా!, పరాంకుశ = పరాంకుశులనబడే, మునీంద్ర = మునిశ్రేష్ఠులైన నమ్మాళ్వార్లు, ఆది= మొదలైన, పరమాచార్య = పరమాచార్యుల, సూక్తయః = **"శెవిక్కినియ శెఞ్జొల్"** అనదగిన శ్రీసూక్తులు, స్వతః ఏవ = సహజంగానే, (తమకు తామే), మమ జిహ్వాయై = దాసుని జిహ్వకు, స్వదంతామ్ = రుచించుగాక!



**7. ఇత్యేతత్ సాదరం విద్వాన్ ప్రార్థనాపంచకం పఠన్ ।**
**ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥**

ఇతి=పూర్వోక్తప్రకారంగా, ఏతత్=ఈ, ప్రార్థనాపంచకం=అయిదు శ్లోకాల రూపంలోని ప్రార్థనలను వ్యక్తం చేసే స్తోత్రాన్ని, సాదరం = ప్రేమతో, పఠన్ = అనుసంధించే, విద్వాన్ = జ్ఞానం కలవాడు, యతిరాజపద+అబ్జయోః= భగవద్రామా నుజుల శ్రీచరణార విందాలలో, పరమాం భక్తిం = మిక్కిలి గొప్ప భక్తిని, ప్రాప్నుయాత్= పొందగలడు.

# శ్రీరామానుజ చతుఃశ్లోకి

(శ్రీరంగం, తిరుమల, పెరుమాళ్ కోయిల్ (కంచి), తిరునారాయణపురం (మేల్కోటె) - అనే నాల్గు దివ్య దేశాలలోను భగవద్రామానుజుల విజయానికి మంగళాన్ని ఆశాసిస్తున్నాయి - ఈ నాల్గు శ్లోకాలు. దీనిని అనంతార్యులు రచించారు.)

**1) అనిశం భజతామనన్యభుజాం చరణాంభోరుహ మాదరేణ పుంసామ్ ।**
**వితరన్ నియతం విభూతిమిష్టాం జయ రామానుజ! రంగధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! మీ చరణారవిందాలను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండే అనన్యగతికులైన దాసులకు ఏ విభూతి అభీష్టమో, ఆ విభూతిని నియతంగా అనుగ్రహిస్తూ, శ్రీరంగంలో మీరు నిత్యం విజయాన్ని పొందాలి.

**2) భువినో విమతాన్ త్వదీయసూక్తిః కులిశీభూయ కుదృష్టిభి స్సమేతాన్ ।**
**శకలీకురుతే విపశ్చితీడ్యా జయ రామానుజ! శేషశైలశృంగే ॥**

భగవద్రామానుజా! విద్వాంసులు పొగడతగిన మీ శ్రీసూక్తి వజ్రాయుధంవంటిది. అది భూమిలో ఉండే కుదృష్టులతోపాటు ప్రతివాదులను అందఱిని చూర్ణం చేస్తున్నది. (ఇటువంటి గొప్పతనాన్ని కల శ్రీసూక్తులను అనుగ్రహించిన) మీరు వేంకటాద్రిశిఖరంపై నిత్యశ్రీఃనిత్యమంగళంగా వర్ధిల్లాలి.

**3) శ్రుతిషు స్మృతిషు ప్రమాణతత్త్వం కృపయాలోచ్య విశుద్ధయా హి బుద్ధ్యా।**
**అకృథాః స్వత ఏవ భాష్యరత్నం జయ రామానుజ! హస్తిధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! నిర్హేతుకకృపతో శ్రుతిస్మృతులలోని ప్రమాణాల యథార్థాన్ని గ్రహించి, విశుద్ధమైన బుద్ధితో చాలా గొప్పదైన శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. ఇటువంటి మీరు శ్రీహస్తిగిరిలో నిత్యంగా వర్ధిల్లాలి.

**4) జయ మాయిమతాంధకారభానో! జయ బాహ్యప్రముఖాటవీకృశానో! ।**
**జయ సంశ్రితసింధుశీతభానో! జయ రామానుజ! యాదవాద్రిశృంగే ॥**

మాయావాదుల మతాలు అనే చీకటికి సూర్యునివంటివాడా! వేదబాహ్యులు మొదలైనవారు అనే అడవికి కార్చిచ్చువంటివాడా! భక్తులనే సముద్రాన్ని ఉప్పొంగించే చంద్రునివంటివాడా! శ్రీరామానుజా! మీరు యాదవాద్రిలో నిత్యం వర్ధిల్లాలి.

**5) రామానుజచతుఃశ్లోకీం యః పఠేన్నియత స్సదా ।**
**ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥**

భక్తులకు నిత్యానుసంధేయంగా నియమింపబడ్డ ఈ రామానుజ చతుఃశ్లోకిని నియమంతో నిత్యానుసంధానం చేసేవారు భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలలో గొప్ప భక్తిని ప్రత్యక్షఫలంగా పొందుతారు.

# ముక్తక శ్లోకాలు

( ఈ శ్లోకాలలో శ్రీరామానుజులు, శ్రీవరవరమునుల వైభవం తెలుపబడింది. వీనిని ఆరాధన చివర చదువుకోవడం మంచిది.)

**1. నమఃప్రణవశోభితం నవకషాయఖండాంబరం**
**త్రిదండపరిమండితం త్రివిధతత్త్వనిర్వాహకమ్ ।**
**దయాంచితదృగంచలం దళితవాదివాగ్వైభవం**
**శమాదిగుణసాగరం శరణమేమి రామానుజమ్ ॥**

నమశ్శబ్దార్థంచేత ప్రణవంచేత ప్రతిపాదింపబడే శేషత్వ – పారతంత్ర్యాలతో విలసిల్లేవారు, నూతన కాషాయవర్ణాన్ని కల వస్త్రాన్ని ధరించినవారు, త్రిదండంతో అలంకరింప బడినవారు, చేతనాచేతనేశ్వరులనే మూడు తత్త్వాలను నిర్వహించేవారు (ఉజ్జీ వింపజేసేవారు), లేక, శరీర – శరీరిభావంతో తత్త్వత్రయాన్ని నిర్వహించినవారు, దయతో అందమైన కటాక్షాలను కలవారు, పరమతవాదుల వాగ్వైభవాన్ని ఖండించిన వారు, శమాదిగుణాలకు సముద్రంవంటివారైన శ్రీరామానుజులను ఆశ్రయిస్తున్నాను.

**2. కాషాయశోభి కమనీయశిఖానివేశం**
**దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।**



**ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం**
**రూపం తవాస్తు యతిరాజ! దృశోర్మమాగ్రే ॥**

ఓ యతిరాజా! కాషాయంతో ప్రకాశిస్తున్నది, అందమైన శిఖాసన్నివేశాన్ని కల్గినది, త్రిదండంతో గొప్పగా ప్రకాశించే శ్రీహస్తాన్ని కల్గినది, తెల్లని యజ్ఞోపవీతాన్ని కల్గినది, ఉదయించే సూర్యునివలె ప్రకాశించేది, మిక్కిలిగా వెలిగే ఊర్ధ్వపుండ్రాలను కల్గినది అయిన నీ రూపం, నా కంటిముందు ప్రత్యక్షం కావాలి.

**3. ఏతాని తాని భువనత్రయపావనాని**
**సంసారరోగశకలీకరణౌషధాని ।**
**జిహ్వాతలే మమ లిఖాని యథా శిలాయాం**
**రామానుజేతి చతురాణ్యమృతాక్షరాణి ॥**

ముల్లోకాలను పావనం చేస్తున్నవి, సంసారమనే రోగాన్ని నశింపజేసే ఔషధాల వంటివి అయిన **"రామానుజ"** అనే ఈ నాల్గు అమృతాక్షరాలను నా జిహ్వాతలంపై, శిలపై వలె, శాశ్వతంగా వ్రాసికొంటాను.

**4. న చేత్ రామానుజేత్యేషా చతురా చతురక్షరీ ।**
**కామవస్థాం ప్రపద్యంతే జంతవో హంత ! మాదృశః ॥**

**"రామానుజః"** అనే ఈ నాల్గు అక్షరాలను కల సమర్థవంతమైన మంత్రమే లేకపోతే, అయ్యో ! మావంటి జీవులం ఎటువంటి అవస్థను పొందుతాము?

**5. పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ ।**
**శ్రీమాన్ ఆవిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥**

పుణ్యమనే పద్మం వికసించడంకోసం, పాపమనే చీకటి నశించడంకోసం గొప్ప కాంతిని కల శ్రీరామానుజులనే సూర్యుడు భూమిలో ఉదయించాడు.

**6. తృణీకృతవిరించాది నిరంకుశవిభూతయః ।**
**రామానుజపదాంభోజ సమాశ్రయణశాలినః ॥**

శ్రీరామానుజుల పదపద్మాలను ఆశ్రయించడంవల్ల ప్రకాశించేవారు. బ్రహ్మాదుల నిరంకుశమైన ఐశ్వర్యాలనుకూడా తృణంగా తలుస్తారు.

**7. శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానం**
**భూమా తస్మిన్ భవతు కుశలీ కోఽపి భూమాసహాయః ।**
**దివ్యం తస్మై దిశతు విభవం దేశికో దేశికానాం**
**కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని ॥**

గొప్ప స్థానం, తేజస్సుకు నిలయమైన శ్రీరంగక్షేత్రం వర్ధిల్లాలి. అక్కడ వేంచేసి ఉండేవాడు, నిర్వచనీయమైన వైభవాన్ని కల్గినవాడు, భూదేవి, లక్ష్మీదేవులతో కలసి ఉండేవాడు అద్వితీయుడైన శ్రీరంగనాథభగవానుడు కుశలం కలవాడు కావాలి. ఆచార్యులకు ఆచార్యులైన శ్రీవరవరమునులు ప్రతిసమయంలోను ఆ శ్రీరంగనాథునకు మంగళాలను కల్గించి, దివ్యమైన వైభవాన్ని కల్గించాలి.

**8. అపగతమదమానైః అంతిమోపాయనిష్ఠైః**
**అధిగతపరమార్థైః అర్థకామానపేక్షైః ।**
**నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః**
**వరవరమునిభృత్యైః అస్తు మే నిత్యయోగః ॥**

మదం, దురభిమానం లేనివారు, చరమపర్వనిష్ఠను కలవారు, పరమార్థాన్ని పొందినవారు, (అందువల్లనే లౌకికమైన, అథమమైన) అర్థకామాలలో అపేక్ష లేనివారు, (అందువల్లనే) జనులందరిపట్ల సుహృద్భావాన్ని కలవారు, (అందువల్లనే) క్రోధాన్ని, లోభాన్ని లేనివారైన శ్రీవరవరముని శిష్యులతో నాకు నిత్యమైన సంబంధం కలగాలి.

# శ్రీసుదర్శనాష్టకం

( ఈ స్తోత్రంలో భగవానుని ఆయుధాలతో ముఖ్యమైన శ్రీసుదర్శనం స్తుతింపబడుతున్నది. దీనిని శ్రీవేదాంత దేశికులు రచించారు.)

**1. ప్రతిభటశ్రేణిభీషణ! వరగుణస్తోమభూషణ!**
**జనిభయస్థానతారణ ! జగదవస్థానకారణ ।**
**నిఖిలదుష్కర్మకర్శన ! నిఖిలసద్ధర్మదర్శన !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**



ప్రత్యర్థులను ధ్వనితో బలహీనులను చేసి, వారి గుండెలను బ్రద్దలు చేసేవాడవు, సమస్తకల్యాణ గుణములను సహజంగా కల్గినవాడవు, సంసారసాగరమునుండి భక్తులను తీరమునకు చేర్చేవాడవు, సంసారుల స్థితిప్రవృత్త్యాదులకు కారణమైనవాడవు, సమస్తపాపములను నశింపచేసేవాడవు, భక్తులకు (ధ్రువాదులకు) జ్ఞానమును కల్గించేవాడవు, భక్తులకు జయమును కల్గించేవాడవుగా మంత్రశాస్త్రమున కీర్తింపబడినవాడవు, విజయలక్ష్మీకటాక్షమునకు లక్ష్యమైనవాడవు అగు ఓ శ్రీసుదర్శనమా! విజయీ భవ, విజయీ భవ.

**2. శుభజగద్రూపమండన! సురజనత్రాసఖండన!**
**శతమఖబ్రహ్మవందిత! శతపథబ్రహ్మనందిత!।**
**ప్రథితవిద్వత్సపక్షిత! భజదహిర్బుధ్న్యలక్షిత!**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

విశ్వరూపుడగు భగవానునకు అలంకారమైనవాడవు, **"సురద్విషాం ప్రాణవినాశి"** అనునట్లు దేవతలను బాధించే రాక్షసులను నశింపచేసేవాడవు, ఇంద్రుడు మొదలగు వారిచే నమస్కరింపబడేవాడవు, ఉపనిషత్‌శతముచే ప్రతిపాదింపబడే వైభవమును కల్గినవాడవు, ఆశ్రితులగు విద్వాంసులచే కీర్తింపబడేవాడవు, అహిర్బుధ్న్యుడను భక్తునిచే (రుద్రునిచే) గ్రహింపబడిన మహిమను కల్గినవాడవైన ఓ సుదర్శనచక్రమా ! జయ ! విజయీ భవ ! జయ ! విజయీ భవ!

**3. స్ఫుటతటిజ్జాలపింజర ! పృథుతరజ్వాలపంజర !**
**పరిగతప్రత్నవిగ్రహ ! పటుతరప్రజ్ఞదుర్గ్రహ !**
**ప్రహరణగ్రామమండిత ! పరిజనత్రాణమండిత!**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

ప్రకాశించే మెఱుపుల సమూహముయొక్క వర్ణమువలె పసిడివన్నెను కలవాడా! మిక్కిలి పెద్దవి అయిన అగ్నిజ్వాలల సమూహాన్ని కలవాడా! పురాతనమైన (నిత్యమైన) దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడా! మిక్కిలి పటిష్ఠమైన బుద్ధిని కలవారిచేకూడ తెలిసికొనుటకు సాధ్యం కానివాడా! పలు దివ్యాయుధసమూహముచే అలంకరింపబడినవాడా! ఆశ్రితసంరక్షణలో సామర్థ్యం కలవాడా! ఓ సుదర్శనమా! నీకు జయము జయము, నీకు జయము జయము.

**4. నిజపదప్రీతసద్గణ! నిరుపధిస్ఫీతషడ్గుణ!**
**నిగమనిర్వ్యూఢవైభవ! నిజపరవ్యూహవైభవ!**
**హరిహయద్వేషిదారణ! హరపురప్లోషకారణ!**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

నీ స్థానాన్ని పొందడం ద్వారా సంతోషించిన సత్పురుషులను కలవాడా! జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు – అనే ఆఱు గుణాలను కలవాడా. వేదములలో కీర్తింపబడే వైభవం కలవాడా! నిత్యాలైన పరము, వ్యూహము మొదలగు అయిదు రూపాలను కలవాడా! ఇంద్రశత్రువులైన అసురులను, రాక్షసులను సంహరించేవాడా! కాశీనగరదాహమునకు కారణమైనవాడా! ఓ శ్రీసుదర్శనమా ! జయ ! విజయీ భవ. జయ! విజయీ భవ.

భగవానుని పరవ్యూహాది రూపాలలో స్వామిని వెన్నంటియుండేవాడు, శ్రీసుదర్శనుడు.

**5. దనుజవిస్తారకర్తన ! దనుజవిద్యానికర్తన !**
**జగదవిద్యానివర్తన (జనితమిస్రావికర్తన) ! భజదవిద్యానివర్తన !**
**అమరదృష్టస్వవిక్రమ ! సమరజుష్టభ్రమిక్రమ !**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

అసురుల విస్తృతిని నశింపజేసేవాడా! రాక్షసమాయను పారద్రోలేవాడా! లోకములందలి అవిద్యను పోగొట్టేవాడా! (సంసారమను చీకటి రాత్రికి సూర్యుని వంటివాడా!) భక్తుల అజ్ఞానమును నాశనము చేసేవాడా! దేవతలచే దర్శింపబడే విక్రమమును కలవాడా ! యుద్ధములందు విచిత్రములైన భ్రమణములను కలవాడా! శ్రీసుదర్శనమా ! జయము జయము. జయము జయము.

**6. ప్రతిముఖాలీఢబంధుర! పృథుమహాహేతిదంతుర!**
**వికటమాయాబహిష్కృత! వివిధమాలాపరిష్కృత !**
**పృథుమహాయంత్రతంత్రిత! దృఢదయాతంత్రయంత్రిత**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

ప్రత్యాలీఢమను పాదాల సన్నివేశంతో మనోహరమైన రూపమును కలవాడా! బలిష్ఠమైన, గొప్పవైన ఆయుధాలచే వ్యాప్తమైనవాడా! వికటమైన మాయకు దూరమైన



వాడా! అనేకవిధములైన మాలికలచే అలంకరింపబడినవాడా! గొప్పదైన యంత్రమున ప్రతిష్ఠింపబడేవాడా! దయ అనెడి తంత్రంచే వశం చేసికొనబడినవాడా! శ్రీసుదర్శనమా! జయము జయము, జయము జయము.

**7. మహితసంపత్సదక్షర! విహితసంపత్ షడక్షర!**
**షడరచక్రప్రతిష్ఠిత! సకలతత్త్వప్రతిష్ఠిత !**
**వివిధసంకల్పకల్పక! విబుధసంకల్పకల్పక!**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

గొప్ప ఐశ్వర్యమును ఇచ్చేవాడా!, బ్రహ్మజ్ఞానులకు మోక్షరూపమైనవాడా! ఐశ్వర్యమును అనుగ్రహించే, ఆఱు అక్షరాలను కల్గిన మంత్రముచే ఉపాస్యుడా!, షట్కోణ చక్రవర్తీ!, అంతర్యామిరూపంతో సకలతత్త్వములందు వ్యాపించి యున్నవాడా!, అన్ని కోరికలను అనుగ్రహించేవాడా! దేవతల అభీష్టాలను తీర్చేవాడా! ఓ శ్రీసుదర్శనమా! జయము జయము, జయము జయము.

**8. భువననేత్ర! త్రయీమయ! సవనతేజస్త్రయీమయ!**
**నిరవధిస్వాదుచిన్మయ! నిఖిలశక్తే! జగన్మయ! ।**
**అమితవిశ్వక్రియామయ! శమితవిష్వగ్భయామయ!**
**జయ! జయ! శ్రీసుదర్శన! జయ! జయ! శ్రీసుదర్శన! ॥**

ముల్లోకాలకు నేత్రమైనవాడా ! వేదస్వరూపుడా! యాగాలలో ఆరాధింపబడే గార్హపత్య – ఆహవనీయ– దక్షిణాగ్నులను మూడు అగ్నుల రూపమైనవాడా! నిరవధికమైన, భోగ్యమైన జ్ఞానంయొక్క స్వరూపమైనవాడా! సకలవిధమైన శక్తిని కలవాడా! జగద్రూపుడా! సర్వకర్మసమారాధ్యుడా! భక్తుల సమస్త భయాలు అనే రోగమును పోగొట్టేవాడా! శ్రీ సుదర్శనమా! జయము, జయము, శ్రీసుదర్శనమా! జయము జయము.

**9. ద్విచతుష్క మిదం ప్రభూతసారం పఠతాం వేంకటనాయకప్రణీతమ్ ।**
**విషమేఽపి మనోరథః ప్రధావన్న విహన్యేత రథాంగధుర్యగుప్తః ॥**

శ్రీవేంకటనాథులచే అనుగ్రహింపబడినది, గొప్ప అర్థములను కల్గినదైన ఈ సుదర్శనాష్టకాన్ని పఠించే భక్తుల మనస్సు ప్రమాదవశమున అప్రాప్త విషయాలలో సంచరించినా, భగవానునిచే (సుదర్శనముచే) రక్షింపబడినదై, ఉజ్జీవిస్తుంది. నశించదు.

అది ఏవిధంగా? అంటే, చక్కని, పటిష్ఠములైన చక్రములను కల్గిన రథము విషయమైన (ఎత్తు పల్లములతో కూడిన) దారిలో పయనించినా, అది సమర్థుడైన సారథిచే నడుపబడి రక్షింపబడితే భగ్నం కాదుకదా!

**కవితార్కిక సింహాయ కల్యాణగుణశాలినే,**
**శ్రీమతే వేంకటేశాయ వేదాన్తగురవే నమః**

# శ్రీషోడశాయుధస్తోత్రం

1. **స్వసంకల్పకలాకల్పై రాయుధై రాయుధేశ్వరః ।**
**జుష్టః షోడశభిర్దివ్యై జుషతాం వః (నః) పరః పుమాన్ ॥**

తన సంకల్పజ్ఞానముయొక్క పదునాఱవ భాగములా ! అనునట్లున్న పదునాఱు ఆయుధములతో కూడినవాడును, శ్రీసుదర్శనమూర్తి రూపములోనున్న పరమపురుషుడు మిమ్ములను (మనలను) ఆనందపఱచును గాక !

2. **యదాయత్తం జగచ్చక్రం కాలచక్రం చ శాశ్వతమ్ ।**
**పాతు వ (న) స్తత్ పరం చక్రం చక్రరూపస్య చక్రిణః ॥**

జననమరణములతో చక్రమువలె పరిభ్రమించు లోకము, అట్టి పరిభ్రమణ స్వభావమునే కల్గిన శాశ్వతమైన కాలమును ఏ సుదర్శన చక్రముయొక్క అధీనమున నున్నవో, అట్టి గొప్పదైన, సుదర్శన భగవానుని ఆయుధమగు చక్రరాజము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

3. **యత్రప్రసూతిశతై రాసన్ రుద్రాః పరశులాంఛనాః ।**
**స దివ్యో హేతిరాజస్య పరశుః పరిపాతు వః (నః) ॥**

శ్రీసుదర్శనమును ప్రార్థించి, పరశువు అను ఆయుధమును వరముగా పొంది, అందువలన ఖండపరశువు అను ప్రసిద్ధిని పొంది, సంహారాధికారులగు రుద్రులు ఏ పరశువువలన జనించినవారయ్యిరో, అట్టి పరశువు అను ఆయుధము మిమ్ములను (మనలను) రక్షించునుగాక !

4. **హేలయా హేతిరాజేన యస్మిన్ దైత్యాః సముద్ధృతే ।**
**శకుంతా ఇవ ధావంతి స కుంతః పాలయేత వః ॥**



ఆయుధ ప్రభువైన శ్రీసుదర్శన భగవానుడు ఈటె అనే ఆయుధమును విలాసంగా చేతితో ఎత్తగానే దానిని చూచి అసురులు భయముతో పక్షులవలే పరుగు తీయుదురు. అట్టి సుదర్శనుని కుంతమనే ఆయుధము మనలను కాపాడుగాక!

5. **దైత్యదానవముఖ్యానాం దండ్యానాం యేన దండనమ్ ।**
**హేతిదండేశదండోఽసౌ భవతాం (అస్మాకం) దండయేత్ ద్విషః ॥**

దండింపదగిన దైత్యులు, దానవులు మొదలగువారిని ఏ దండాయుధముతో భగవానుడు దండించునో, అట్టి శ్రీసుదర్శనుని దండాయుధము మీ (మన) శత్రువులను దండించును గాక !

6. **అనన్యాన్వయభక్తానాం రుంధన్ ఆశామతంగజాన్ ।**
**అనంకుశవిహారో వః (నః) పాతు హేతీశ్వరాంకుశః ॥**

తనను తప్ప వేఱొకరిని ఆశ్రయింపని భక్తులయొక్క లౌకికములైన ఆశలు అను మదగజములను నిరోధించునది, ఎట్టి అడ్డు లేని విహారమును కల్గినదగు శ్రీసుదర్శన ప్రభువుయొక్క అంకుశమను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

7. **సంభూయ శలభాయంతే యత్ర పాపాని దేహినామ్ ।**
**స పాతు శతవక్త్రాగ్నిహేతిః హేతీశ్వరస్య వః (నః) ॥**

సంసారుల పాపసమూహములు అన్నియు కలసి ఏ (శతముఖాగ్ని అను) ఆయుధమునందు, అగ్నిలో మిడతలవలె, నిశ్శేషముగా దహింపబడుచున్నవో, అట్టి శ్రీసుదర్శన భగవానునియొక్క శతముఖాగ్ని అను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక!

8. **అవిద్యాం స్వప్రకాశేన విద్యారూప శ్ఛినత్తి యః ।**
**స సుదర్శననిస్త్రింశః సౌతు వః (నః) తత్త్వదర్శనమ్ ॥**

విద్యారూపమగు ఏ ఖడ్గము ప్రకృతిసంబంధమూలకమైన అజ్ఞానమును ఛేదించునో, అట్టి శ్రీసుదర్శనదేవుని ఖడ్గము మీకు (మనకు) పరతత్త్వదర్శనమును కల్గించును గాక !

9. **క్రియాశక్తిగుణో విష్ణో యో భవత్యతిశక్తిమాన్ ।**
**అంకురశక్తి స్సా శక్తి రశక్తిం వారయేత వః (నః) ॥**

భగవానుని జగత్కర్తృత్వమను గుణము ఏ శక్తి అను ఆయుధముయొక్క రూపమో, మొక్కవోని సామర్థ్యమును కల ఆ శక్తి మీ (మనయొక్క) అశక్తిని పోగొట్టును గాక. అనగా – మన జ్ఞానానుష్ఠానములయందు కల్గు ఆశక్తిని తొలగించునుగాక.

**10. తారత్వం యస్య సంస్థానే శబ్దే చ పరిదృశ్యతే ।**
**ప్రభోః ప్రహరణేంద్రస్య పాంచజన్య స్స పాతు వః (నః) ॥**

భగవానుని శంఖమగు పాంచజన్యము – రూపమున, స్వరమున తారత్వమును (ఔన్నత్యమును, ప్రణవరూపమును) కల్గియున్నది. అట్టి శ్రీసుదర్శనుని పాంచజన్యము మిమ్ములను, (మనలను) రక్షించునుగాక!

**11. యం సాత్విక మహంకార మామనంత్యక్షసాయకమ్ ।**
**అవ్యా ద్వ (న్న) శ్చక్రరూపస్య తద్ధనుః శార్ఙ్గధన్వనః ॥**

ఇంద్రియములు అను బాణములను కల్గిన ఏ శార్ఙ్గమను వింటిని పరాశరమహర్షి మొదలగు తత్త్వవిదులు పంచేంద్రియములకు మూలకమగు సాత్త్వికహంకారముయొక్క తత్వముగా పల్కిరో, అట్టి శ్రీసుదర్శనభగవానుని విల్లు అగు శార్ఙ్గము మిమ్ములను (మనలను) కాపాడును గాక !

**12. ఆయుధేంద్రేణ యేనైవ విశ్వసర్గో విరచ్యతే ।**
**స వః (నః) సౌదర్శనః కుర్యాత్ పాశః పాశవిమోచనమ్ ॥**

పాశమను ఏ ఆయుధముద్వారా భగవానుడు జగత్సృష్టిని చేయునో, అట్టి శ్రీసుదర్శనభగవానుని పాశమను ఆయుధము మిమ్ములను (మనలను) సంసార బంధమునుండి విడిపించునుగాక.

**13. విహారో యేన దేవస్య విశ్వక్షేత్రకృషీవలః ।**
**వ్యజ్యతేనేన సీరేణ నాసీరవిజయోఽస్తు వః (నః) ॥**

భగవానునియొక్క లీలావిహారము ఏ హలమను ఆయుధముచే చేయబడుచున్నదో, ఏ హలాయుధము భగవానుని ప్రపంచమును క్షేత్రమును పండించు వ్యవసాయదారునిగా తెలియజేయుచున్నదో, అట్టి సుదర్శనుని హలాయుధము మీకు (మనకు) యుద్ధ రంగమున విజయములను కల్గించును గాక !

**14. ఆయుధానాం మహం వజ్ర మిత్యగీయత య స్స వః (నః) ।**
**అవ్యాత్ హేతీశ వజ్రోఽయం దధీచ్యస్థిసముద్భవః ॥**



విభూతిసందర్శనయోగమున **"యద్యత్ విభూతిమత్ సత్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్"** అనుచు శ్రీకృష్ణభగవానుడు గీతలో లోకములోని ఉత్కృష్టములైన వస్తువులన్నియు తన రూపములే అని పల్కు సందర్భమున వజ్రాయుధము తానే అనెను. అట్టి గొప్ప దనమును కల్గినది, భగవత్ స్వరూపాత్మక మైనదగు దధీచిముని వెన్నెముకనుండి నిర్మింపబడిన శ్రీసుదర్శన భగవానుని వజ్రాయుధము మిమ్ములను (మనలను) కాపాడు గాక!

**15. విశ్వసంహృతిశక్తి ర్యా విశ్రుతా బుద్ధిరూపిణీ ।**
**సా (నః) సౌదర్శినీ భూయాద్గదప్రశమనీ గదా ॥**

**"సంహృతిక్రీడితమ్"** అను విధముగా భగవానుని లీలలో ఒకటిగా చెప్పబడు లోకసంహారమునకు మూలమైన శక్తిగా, బుద్ధికి అధిష్ఠానదేవతగా చెప్పబడు శ్రీసుదర్శన భగవానుని గద మీ (మన) మనోవ్యాధులను పోగొట్టును గాక ! (భగవద్రామానుజుల మతమును ద్వేషించువారగు పరవాదులను ఎట్లు జయించుట? అను భీతియే ఇచట మనోవ్యాధి. ఆ వ్యాధిని సుదర్శన భగవానుని గద పోగొట్టునుగాక ! అని తాత్పర్యము.)

**16. యాత్యతిక్షోదశాలిత్వం ముసలో యేన తేన వః ।**
**హేతీశముసలేనాశు భిద్యతాం మోహమౌసలమ్ ॥**

శ్రీ సుదర్శనభగవానుడు ముసలమను ఆయుధాన్ని ధరించియున్నాడు. ఆ ముసలము లోకములోని మిగిలిన అన్ని ముసలములలో అనుప్రవేశించినందువలననే అవి వస్తువులను పొడిచేయు శక్తిని కలిగినవి అయినవి. ఇట్టి ఈ సుదర్శులని ముసలాయుధము మీకు అజ్ఞానమువలన కలిగిన కాఠిన్యమును త్వరగా పోగొట్టు గాక.

**17. శూలిదృష్టమనో ర్వాచ్యో యేన శూలయతి ద్విషః ।**
**భవతాం తేన భవతాత్ త్రిశూలేన విశూలితా ॥**

పరమశివునిచే దర్శింపబడిన శ్రీరామతారకమంత్రమునకు వాచ్యుడు, భగవానుడగు శ్రీరామచంద్రుడు ఏ త్రిశూలమను ఆయుధముచే శత్రువులను శూలమను వ్యాధిని కల్గినవారిగా బాధించుచున్నాడో, అట్టి శ్రీసుదర్శన భగవానుని త్రిశూల మను ఆయుధము మీ పీడలను అన్నిటిని పోగొట్టునుగాక !

**18. అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యం ప్రచక్షతే ।**
**సోఽవ్యాత్ సుదర్శనో విశ్వ మాయుధైః షోడశాయుధః ॥**

సర్వాస్త్రములకును కారణమగువాడు, సర్వాయుధములను దాల్చినవాడు, తదనుగుణముగా **"తోళ్‌గళ్ ఆయిరత్తాయ్"** అనునట్లు సహస్రబాహువులను కలవాడు, శ్రీసుదర్శనరూపి అగు భగవానుడు తన ఆయుధములతో విశ్వమును రక్షించుగాక!

**19. శ్రీమద్వేంకటనాథేన శ్రేయసే భూయసే సతామ్ ।**
**కృతోఽయ మాయుధేంద్రస్య షోడశాయుధసంస్తుతిః ॥**

ఈ విధముగా తాము అనుగ్రహించిన స్తోత్రము, పూర్వ శ్లోకమున సూచించిన విధముగా, సర్వప్రయోజనకరమగుటయే కాక, **"సత్సమృద్ధిం చ యుక్తామ్"** అను రచించిన రీతిగా సాధుజనసంతుష్టికరమనియు, దీనిని అనుసంధించువారలకు సకల శ్రేయస్సులు కల్గించుననియు పల్కుచు, గ్రంథ చోరులు తమ గ్రంథమును దొంగిలింప కుండుటకై చివరగా స్వనామాంకితముగా శ్రీదేశికులు ఈ శ్లోకమున తెలుపుచున్నారు. మంచివారికి గొప్ప హితం కల్గడం కోసం శ్రీ వేదాంత దేశికులు పదహాఱు బాహులలో పదహారు ఆయుధాలను కల, ఆయుధాలలో ప్రముఖుడైన ఈ సుదర్శనుని స్తుతిని రచించారు.

# శ్రీసుదర్శనషట్కమ్

(ఇందులో శ్రీసుదర్శనషడక్షరమంత్రంలోని ఆఱు అక్షరాలు వరుసగా ఒక్కొక్కశ్లోకం మొదట కూర్చబడ్డాయి. దీనిని ప్రతిదినం చదువుకోవడం శుభకరం.)

**1) సహస్రాదిత్యసంకాశం సహస్రవదనం ప్రభుమ్ ।**
**సహస్ర(దోః)దం సహస్రారం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

వేయి సూర్యులతో సాటి వచ్చేవాడు, వేయి ముఖాలను కలవాడు, గొప్ప మహిమను కలవాడు, వేయి బాహువులను కలవాడు, వేయి అరాలను (ఆకులను) కలవాడైన శ్రీసుదర్శన భగవానుని శరణు పొందుతున్నాను.

**2) హసంతం హారకేయూరమకుటాంగదభూషణైః ।**
**శోభనైః భూషితతనుం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

(భక్తుల చూచి) మందహాసం చేసేవాడు, మంగళకరాలైన హారాలు, కేయూరాలు, కిరీటం, అంగదాలవంటి అలంకారాలతో అలంకరింపబడిన దేహాన్ని కలవాడైన శ్రీసుదర్శనుని శరణు పొందుతున్నాను.



**3) స్రాకారసహితం మంత్రం వదతాం శత్రునిగ్రహమ్ ।**
**సర్వరోగప్రశమనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

(**"సహస్రార హుం ఫట్"** అనే) **"స్రా"** అనే అక్షరంతో కూడిన శ్రీసుదర్శన షడక్షరీమంత్రాన్ని పఠించేవారికి శత్రుజయాన్ని అన్ని రోగాలనుండి నివారణను కల్గించే శ్రీసుదర్శనుని శరణు వేడుతున్నాను.

**4) రణత్కింకిణిజాలేన రాక్షసఘ్నం భయావహమ్ ।**
**వ్యాప్తకేశం విరూపాక్షం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

గొప్పగా ధ్వనించే కింకిణీ జాలంతో రాక్షసులను హరించేవాడు, భక్తుల భయాన్ని తీర్చేవాడు, అంతటా వ్యాపించిన కేశపాశాన్ని కలవాడు, భగవద్వి రోధులకు భయాన్ని కల్గించే భీకరమైన నేత్రాలను కలవాడైన (త్రినేత్రుడైన) శ్రీసుదర్శనుని ప్రపత్తి చేస్తున్నాను.

**5) హుంకారభైరవం భీమం ప్రణతార్తిహరం ప్రియమ్ ।**
**సర్వదుష్టప్రశమనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

దుష్టులపట్ల హుంకారమనే ఘోరమైన నాదాన్ని చేసేవాడు, అందువల్ల వారికి భయంకరుడు, తనను ఆశ్రయించిన వారి ఆర్తిని హరించేవాడై, వారికి ప్రియంగా ఉండేవాడు, దుష్టులనందఱిని నశింపజేసేవాడైన శ్రీసుదర్శనుని ప్రపత్తి చేస్తున్నాను.

**6) ఫట్కారాంతమనిర్దేశ్య దివ్యమంత్రేణ సంయుతమ్ ।**
**శుభం ప్రసన్నవదనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥**

(**"సహస్రార హుం ఫట్"** అనే సుదర్శన షడక్షరిరూపంలోని) **"ఫట్"** కారాన్ని చివర కల్గినది, ఇంతటిది అని చెప్పబడడానికి సాధ్యం కానిది అయిన దివ్యమైన మంత్రంతో కూడినవాడు, భక్తులకు మంగళకరుడు, ప్రసన్నవదనాన్ని కలవాడైన శ్రీసుదర్శనుని ప్రపత్తి చేస్తున్నాను.

**7) ఏతైః షడ్భిః స్తుతో దేవో భగవాన్ శ్రీసుదర్శనః ।**
**రక్షాం కరోతు సర్వాత్మా సర్వత్ర విజయీ భవేత్ ॥**

**"సహస్రార హుం ఫట్"** అనే శ్రీసుదర్శన షడక్షరిలోని అక్షరాలను – వరుసగా ఒక్కొక్క శ్లోకంలో ఒక్కొక్క అక్షరాన్ని ప్రారంభంలో కల్గిన ఈ ఆఱు శ్లోకాలతో స్తుతింపబడిన వాడు దేవుడు, అందఱికి ఆత్మయైన శ్రీసుదర్శన భగవానుడు (ఈ స్తుతి పఠించేవాడు) రక్షిస్తాడు. ఈ స్తుతిని పఠించేవాడు అంతటా విజయాన్ని పొందగలడు.

# శాత్తుముఱై (మంగళాశాసన) క్రమము

(ఈ శ్లోకాలను ఆరాధనలో నివేదన అయిన తరువాత హారతి ఇస్తూ చదువుకోవాలి)

**1. లక్ష్మీచరణలాక్షాంక సాక్షి శ్రీవత్సవక్షసే ।**
**క్షేమంకరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళమ్ ॥**

లక్ష్మీదేవి శ్రీచరణాలలోని పారాణితో ముద్రింపబడిన గుర్తులను వక్షఃస్థలంలో కలవాడు, అందఱికి శ్రేయస్సును కల్గించేవాడైన శ్రీరంగనాథునకు మంగళం.

**2. శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేర్థినామ్ ।**
**శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

శ్రీదేవికి వల్లభుడు, మంగళాలకు నిధి, ప్రార్థించేవారికి నిధి, శ్రీవేంకటాద్రిలో నివసించేవాడైన శ్రీనివాసునకు మంగళం.

**3. అస్తు శ్రీస్తనకస్తూరీ వాసనావాసితోరసే ।**
**శ్రీహస్తిగిరినాథాయ దేవరాజాయ మంగళమ్ ॥**

లక్ష్మీదేవి స్తనాలలో అలంకరింపబడిన కస్తూరీపంకంచే ముద్రింపబడిన వక్షస్సును కలవాడు, శ్రీకరిగిరినాథుడైన దేవరాజ (వరదరాజ) స్వామికి మంగళం.

**4. కమలాకుచకస్తూరీ కర్దమాంకితవక్షసే ।**
**యాదవాద్రినివాసాయ సంపత్పుత్రాయ మంగళమ్ ॥**

కమలాదేవి స్తనాలలో అలంకరింపబడిన కస్తూరిచే అంకితమైన వక్షఃస్థలాన్ని కలవాడు, యాదవాద్రిని నివాసంగా కలవాడైన సంపత్కుమారునకు (శెల్వప్పిళ్ళైకు) మంగళం.

**5. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే ।**
**చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥**

కోసలదేశప్రభువు, గొప్ప గుణాలకు సముద్రంవంటివాడు, దశరథ చక్రవర్తి కుమారుడు, సార్వభౌముడైన శ్రీరామునకు మంగళం.

**6. అస్తు గోపాలబాలాయ నిత్యాయ పరమాత్మనే ।**
**భక్తవాత్సల్యనిధయే నిత్యభోగ్యాయ మంగళమ్ ॥**



నిత్యుడు, పరమాత్మ, భక్తవాత్సల్యమనే గుణానికి నిధి, సదా భోగ్యుడైన గోపాలబాలునకు మంగళం.

**7. కర్కటే పూర్వఫల్గున్యాం జాతాయై తులసీవనే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**

కర్కటకమాసం పుబ్బానక్షత్రంలో తులసీవనంలో అవతరించిన, విష్ణుచిత్త తనూజ అయిన గోదాదేవికి మంగళం.

**8. శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే ।**
**శ్రీతింత్రిణీమూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥**

గొప్ప నగరమైన శ్రీనగరిలో (ఆళ్వార్ తిరునగరిలో) తామ్రపర్ణీనదీ తీరం లోని చింతచెట్టు మూలంలో ప్రకాశించే తేజఃస్వరూపులైన శఠకోపులకు మంగళం.

**9. శేషో వా సైన్యనాథో వా శ్రీపతిర్వేతి సాత్త్వికైః ।**
**వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్ ॥**

ఆదిశేషుడా? విష్వక్సేనులా! లేక, సాక్షాత్తు శ్రియఃపతియేనా?-అని ఈవిధంగా మహాప్రాజ్ఞులైన సాత్త్వికజనులచేసైతం ఉత్ప్రేక్షింపబడే గొప్ప తనాన్ని కల శ్రీభాష్య కారులకు మంగళం.

**10. తులామూలావతీర్ణాయ తోషితాఖిలసూరయే ।**
**రమ్యజామాతృమునయే శేషాంశాయాస్తు మంగళమ్ ॥**

తులామాసం మూలానక్షత్రంలో అవతరించినవారు, సూరులను (ఆళ్వార్లను) అందఱిని సంతోషింపజేసినవారు, ఆదిశేషాంశలో అవతరించిన వారైన శ్రీవరవర మునులకు మంగళం.

**11. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।**
**సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥**

మంగళాశాసనపరులైన అస్మదాచార్యులనుండి ఆరంభించే ఆచార్య పరంపరలోని పూర్వాచార్యులందఱిచే సత్కరింపబడిన-నత్తను కలవానినిగా చేయబడిన (మంగళాశాసనం చేయబడిన) భగవానునకు (లేక, కాలక్షేపగ్రంథానికి) మంగళం.

**1) సర్వదేశదశాకాలేష్వవ్యాహత పరాక్రమా ।**
**రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్ ॥**

సమస్తదేశ–అవస్థా–కాలాలలో ఏవిధమైన అడ్డు, ఆటంకం లేని పరాక్రమాన్ని కల్గినదై శ్రీరామానుజుల దివ్యాజ్ఞ వర్ధిల్లాలి, అభివర్ధిల్లాలి.

**2) రామానుజార్యదివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్జ్వలా ।**
**దిగంతవ్యాపినీ భూయాత్ సా హి లోకహితైషిణీ ॥**

ప్రతిదినం శ్రీరామానుజుల దివ్యాజ్ఞ గొప్పగా ప్రకాశిస్తూ దిగంతాల వరకు వ్యాపించినది కావాలి. అది లోకహితాన్ని కల్గించేది కదా!

**3) శ్రీమన్! శ్రీరంగశ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ ।**
**శ్రీమన్! శ్రీరంగశ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ ॥**

శ్రియఃపతీ! శ్రీరంగంలోని సంపద ఏ ఉపద్రవం లేనిదిగా అనుదినం నీవు వర్ధిల్లజేయాలి.

వేదాంతదేశికులు అనుగ్రహించిన

# దశావతార స్తోత్రమ్

**1. దేవో నః శుభ మాతనోతు దశథా నిర్వర్తయన్ భూమికాం**
**రంగే ధామని లబ్ధనిర్భరరసై రధ్యక్షితో భావుకైః ।**
**యద్భావేషు పృథగ్విధేష్వనుగుణాన్ భావాన్ స్వయం బిభ్రతీ**
**యద్ధర్మై రిహ ధర్మిణీ విహరతే నానాకృతి ర్నాయికా ॥**

నాయికా=శ్రీరంగనాయకి, పృథగ్విధేషు యద్భావేషు=ఏ దేవాధిదేవునియొక్క పలు విధాలైన అవతారాలలో, అనుగుణాన్ భావాన్ = ఆ యా అవతారాలకు తగిన అవతారాలను, స్వయం బిభ్రతీ = తానుకూడా ధరిస్తున్నదై, నానా+ఆకృతిః= పలువిధాలైన ఆకారాలను కల్గినదై, యద్ధర్మైః ధర్మిణీ = ఏ దేవునియొక్క కల్యాణగుణాలకు అనుగుణమైన కల్యాణగుణాలను కల్గినదై, ఇహ విహరతే = ఈలోకంలో విహరిస్తున్నదో, లబ్ధనిర్భరరసైః భావుకైః = మహానందాన్ని పొందే పరమరసికులచేత, రంగే ధామని = శ్రీరంగక్షేత్రమనే రంగస్థలంలో, అధ్యక్షితః= సాక్షాత్కరింపబడినవాడై, దశథా భూమికాం నిర్వర్తయన్ = దశావతారాలనే పది వేషాలను చక్కగా గ్రహించినవాడైన, సః దేవః = ఆ దేవాధిదేవుడు (శ్రీరంగ నాథుడు), నః శుభమ్ అతనోతు = మనకు శుభాన్ని విరివిగా కల్గించుగాక!



## మత్స్యావతారం

**2. నిర్మగ్నశ్రుతిజాలమార్గణదశాదత్తక్షణైః వీక్షణైః**
**అంత స్తన్వదివారవిందగహనాన్యౌదన్వతీనా మపామ్ ।**
**నిష్ప్రత్యూహతరంగరింఖణమిథఃప్రత్యూఢపాథఃచ్ఛటా–**
**డోలారోహసదోహలం భగవతో మాత్స్యం వపుః పాతు నః ॥**

నిర్మగ్నశ్రుతిజాల = సముద్రంలోపల పూర్తిగా మునిగిపోయిన వేదసమూహాలను, మార్గణదశా=అన్వేషించే దశలో, దత్తక్షణైః = జాగరూకతను కల్గినవైన, వీక్షణైః= చూపులతో, ఔదన్వతీనామ్ అపామ్ అంతః = సముద్రానికి చెందిన జలాల లోపల, అరవిందగహనాని తన్వత్ ఇవ=తామరపూల వనాలను విస్తరింపజేసే రీతిలో ఉన్నది, నిష్ప్రత్యూహ = ఏ ఆటంకం లేకుండా సంభవించే, తరంగరింఖణ= అలలు ఎగిసిపాటు వల్ల, మిథః ప్రత్యూఢ = పరస్పరం ఒకదానితో ఇంకొకటి తాకుతున్న, పాథఃచ్ఛటా = జలరాశులనే, డోలా = ఊయలను, ఆరోహ= అధిరోహించడంలో, సదోహలం = కుతూహలాన్ని కల్గినదైన, భగవతః మాత్స్యం వపుః= భగవానుని మత్స్యమూర్తి, నః పాతు = మనలను రక్షించుగాక.

## కూర్మావతారం

**3. అవ్యాసు ర్భువనత్రయీ మనిభృతం కండూయనై రద్రిణా**
**నిద్రాణస్య పరస్య కూర్మవపుషో నిశ్వాసవాతోర్మయః ।**
**యద్విక్షేపణసంస్కృతోదధిపయఃప్రేంఖోలపర్యంకికా**
**నిత్యారోహణనిర్వృతో విహరతే దేవ స్సహైవ శ్రియా ॥**

అద్రిణా = కవ్వంగా నాటిన మందరపర్వతంతో, అనిభృతం = నిరంతరం చేయబడ్డ, కండూయనైః = దురదను తీర్చే ఘర్షణలతో, నిద్రాణస్య = నిద్రాసుఖాన్ని అనుభవించిన, కూర్మవపుషః పరస్య = కూర్మరూపాన్ని పరిగ్రహించిన పరమ పురుషునియొక్క, నిశ్వాసవాత + ఊర్మయః = ఊపిరిగాలులను విడువడమనే నిశ్వాసంయొక్క వాయుపరంపరలు, భువనత్రయీం = ముల్లోకాలను, అవ్యాసుః =

రక్షించుగాక, (ఆ నిశ్వాసవాయుపరంపరలు శ్లోకం ఉత్తరార్ధంలో ఎటువంటివో వర్ణింపబడుతున్నాయి) యద్విక్షేపణ = ఏ నిశ్వాసవాయువుల విక్షేపాలవల్ల (అటు ఇటు వ్యాప్తివల్ల) సంస్కృత = సంస్కరింపబడ్డ (చలించే), ఉదధిపయః = సముద్రజలాలు అనే, ప్రేంఖోలపర్యంకికా = తూగుటుయ్యేలను, నిత్యారోహణ = ఎల్లప్పుడు అధిరోహించడంవల్ల, నిర్వృతః = పరమానందాన్ని పొందే, దేవః = భగవానుడు, శ్రియా సహ = లక్ష్మీదేవితో పాటుగా, విహరతే = విహారాన్ని చేస్తున్నాడో, (అటువంటి కూర్మమూర్తి నిశ్వాసవాయువులు ముల్లోకాలను రక్షించుగాక).

## వరాహావతారం

**4. గోపాయేదనిశం జగంతి కుహనాపోత్రీ పవిత్రీకృత–**
**బ్రహ్మాండః ప్రళయోర్మిఘోషగురుభిః ఘోణారవైః ఘుర్ఘురైః ।**
**యద్దంష్ట్రాంకురకోటిగాఢఘటనానిష్కంపనిత్యస్థితః**
**బ్రహ్మస్తంబ మసౌదసౌ భగవతే ముస్తేవ విశ్వంభరా ॥**

ప్రళయ+ఊర్మిఘోషగురుభిః = ప్రళయసముద్రంలో అలల ఘోషలవలె గొప్పవిగా ఉండే, ఘుర్ఘురైః ఘోణారవైః = **"ఘుర్ ఘుర్"** అనే ముక్కునుండి వెలువడే శబ్దాలతో, పవిత్రీకృతబ్రహ్మాండః = బ్రహ్మాండాలను పవిత్రం చేసినవాడైన, కుహనాపోత్రీ = మాయావరాహరూపుడు, జగంతి అనిశం గోపాయేత్ = లోకాలను అన్నిటినీ రక్షించాలి. (ఈఅవతారంయొక్క విశేషం ఉత్తరార్ధంలో వివరింపబడు తున్నది) భగవతీ అసౌ విశ్వంభరా = పరమపూజ్య అయిన ఈ భూదేవి, ముస్తా ఇవ = చిన్న తుంగముస్తెవలె, యత్ దంష్ట్రా+అంకురకోటి = ఏ వరాహమూర్తియొక్క కోరదంతం మొనతో, గాఢ = గాఢంగా, (బాగా), ఘటనా = (చేసిన) ఘటనవల్ల (గుచ్చి పట్టుకోవడంవల్ల), నిష్కంప= ఏ మాత్రం కదలకుండా ఉండే, నిత్యస్థితః = నిత్యమైన– స్థిరమైన–స్థితిని కల్గినదై, బ్రహ్మస్తంబమ్ = ఆబ్రహ్మస్తంబపర్యంతం అయిన ప్రపంచాన్ని, అసౌత్ = ప్రసవించిందో, (అటువంటి మాయావరాహమూర్తి లోకాలను రక్షించుగాక)

## నరసింహావతారం

**5. ప్రత్యాదిష్టపురాతనప్రహరణగ్రామః క్షణం పాణిజైః**
**అవ్యాత్ త్రీణి జగంత్యకుంఠమహిమా వైకుంఠకంఠీరవః ।**
**యత్ప్రాదుర్భవనాదవంధ్యజఠరా యాదృచ్ఛికాద్వేధసాం**
**యా కాచిత్ సహసా మహాసురగృహే స్థూణా పితామహ్యభూత్ ॥**



క్షణం = ఒక్కక్షణకాలం, పాణిజః = గోళ్ళతో, ప్రత్యాదిష్టపురాతన ప్రహరణ గ్రామః = నిరసింపబడ్డవి (ఉపయోగించకుండా వదలిపెట్టబడ్డవి), పాతబడిపోయినవి అయిన సుదర్శనాది ఆయుధసమూహాన్ని కల్గినవాడు, అకుంఠమహిమా = అంతు లేని, మొక్కపోని మహిమను కలవాడు అయిన, వైకుంఠకంఠీరవః = శ్రీనరసింహమూర్తి భగవానుడు, త్రీణి జగంతి అవ్యాత్ = ముల్లోకాలను రక్షించాలి (ఈ అవతారవిశేషం ఉత్తరార్ధంలో తెలుపబడుతున్నది), సహసా యాదృచ్ఛికాత్ = ముందు వెనుక ఆలోచన లేకుండా వేగంగా తటాలున చేసిన, యత్ ప్రాదుర్భవాత్ = ఏనృసింహమూర్తియొక్క ప్రాదుర్భావ కాలంలో, అవంధ్యజఠరా = గర్భాన్ని ధరించిన, మహాసురగృహే = హిరణ్య కశిపుని గృహంలోని, యా కాచిత్ స్థూణా = ఏ ఒకానొక కొయ్యస్తంభం, వేధసాం = చతుర్ముఖ బ్రహ్మలకు, పితామహీ అభూత్ = పితామహి (తండ్రి తల్లి, నాయనమ్మ) అయినదో (అటువంటి శ్రీనృసింహస్వామి ముల్లోకాలను రక్షించాలి.)

## వామనావతారం (త్రివిక్రమావతారం)

**6. వ్రీడావిద్ధవదాన్యదానవయశోనాసీరధాటీభటః**
**త్రైయక్షం మకుటం పునన్నవతు నః త్రైవిక్రమో విక్రమః ।**
**యత్ప్రస్తావసముచ్ఛ్రితధ్వజపటీవృత్తాంతసిద్ధాంతిభిః**
**స్రోతోభిః సురసింధు రష్టసు దిశాసౌధేషు దోధూయతే ॥**

వ్రీడావిద్ధ = సిగ్గుచేత బాధను పొందిన, వదాన్య = గొప్ప దాత అయిన, దానవ= దానవుడైన బలిచక్రవర్తియొక్క, యశః = కీర్తికంటే, నాసీరధాటీభటః= ముందే పరుగు తీసే సేవకునివంటిది, త్రైయక్షమ్ = మూడు కన్నులను కల్గిన శివునియొక్క, మకుటమ్ = కిరీటాన్ని, పునన్ = పవిత్రం చేస్తూ ఉన్నదైన, త్రైవిక్రమః విక్రమః = త్రివిక్రమమూర్తియొక్క విక్రమణం (పాదాల న్యాసం), నః అవతు = మనలను రక్షించుగాక, (ఆ త్రివిక్రమమూర్తి గొప్పతనం ఎటువంటిది అనేది శ్లోకం ఉత్తరార్ధంలో తెలుపబడుతున్నది), యత్ ప్రస్తావ = ఏ త్రివిక్రమమూర్తియొక్క విక్రమణప్రారంభంలో, సముచ్ఛ్రిత = బాగా ఉన్నతంగా ఎత్తి పట్టుకోబడిన, ధ్వజపటీ = ధ్వజపటమే అని, సిద్ధాంతసిద్ధాంతిభిః = నిర్ణయం చేసేటట్లుగా ఉండే, స్రోతోభిః = (నీటి) ప్రవాహాలతో, సురసింధుః = దేవగంగ, అష్టసు దిశాసౌధేషు = ఎనిమిది దిక్కులు అనే సౌధాలపై, దోధూయతే = చాలా ఎక్కువగా రెపరెపలాడుతున్నది.

## పరశురామావతారం

7. క్రోధాగ్నిం జమదగ్నిపీడనభవం సంతర్పయిష్యన్ క్రమాత్
అక్షత్రా మపి సంతతక్ష య ఇమాం త్రిస్సప్తకృత్వః క్షితిమ్ ।
దత్వా కర్మణి దక్షిణాం క్వచన తా మాస్కంద్య సింధుం వసన్
అబ్రహ్మణ్య మపాకరోతు భగవా నాబ్రహ్మకీటం మునిః ॥

యః = ఏ పరశురామమూర్తి, జమదగ్నిపీడనభవం = తన తండ్రి అయిన జమదగ్నిని వధించడంవల్ల, (బాధించడంవల్ల) కల్గిన, క్రోధ+అగ్నిం = తీవ్రమైన కోపమనే అగ్నిని, సంతర్పయిష్యన్ = తృప్తిని పొందించేవాడై (ఉపశమింపజేసేవాడై), ఇమాం క్షితిం = ఈ భూమిని, అక్షత్రామ్ అపి = క్షత్రియసమూహం లేనిదానినిగా కూడా, క్రమాత్ = క్రమంగా, త్రిస్సప్తకృత్వః = ఇరవై ఒక్కమార్లు, సంతతక్ష = సమూలంగా నఱికి వేశాడో, క్వచన కర్మణి = ఒక యాగకర్మలో, తాం దక్షిణాం దత్వా = ఆ భూమిని దక్షిణగా ఇచ్చివేసి, సింధుమ్ ఆస్కంద్య = సముద్రాన్ని వశం చేసికొని, వసన్ = అక్కడనే నివసిస్తూ ఉన్నవాడైన, భగవాన్ స మునిః = వీర్యాదిగుణసంపన్నుడైన ఆ పరశు రాముడు, ఆబ్రహ్మకీటం = బ్రహ్మమొదలు కీటకంవరకుగల సకలప్రాణి సమూహాలకు, అబ్రహ్మణ్యమ్ అపాకరోతు = అమంగళాన్ని పోగొట్టాలి.

## శ్రీరామావతారం

8. పారావారపయోవిశోషణకలాపారీణకాలానల –
జ్వాలాజాలవిహారహారివిశిఖవ్యాపారఘోరక్రమః ।
సర్వావస్థసకృత్ప్రపన్నజనతాసంరక్షణైకవ్రతీ
ధర్మో విగ్రహవా నధర్మవిరతిం ధన్వీ స తన్వీతః నః ॥

పారావారాపయః = సముద్రజలాన్ని, విశోషణ = ఇంకింపజేయడం అనే, కలాపారీణ = కళలో సామర్థ్యాన్ని కల్గినవి, కాల+అనల = ప్రళయకాలాగ్నియొక్క, జ్వాలాజాల = జ్వాలాసమూహంయొక్క, విహారహారి = లీలలను గ్రహించినవి అయిన, విశిఖ = బాణాల, వ్యాపార= వ్యాపారాలయొక్క, ఘోరక్రమః = ఉగ్రమైన క్రమాన్ని కలవాడు, సర్వావస్థ = ఏ స్థితిలో ఉన్నవారైనా, సకృత్ ప్రపన్న = ఒకసారి ప్రపత్తి చేసిన, జనతా = జనాన్ని, సంరక్షణ+ ఏకవ్రతీ = సంరక్షించడమనే అద్వితీయమైన వ్రతాన్ని కలవాడు, విగ్రహవాన్ ధర్మః = ధర్మమే మూర్తీభవించి నట్లున్నవాడు అయిన,



సః ధన్వీ = కార్ముకపాణి అయిన ఆ కోదండరాముడు, నః = మన, అధర్మవిరతిం = దుష్కార్యాలను చేయడంలో విశ్రాంతిని, తన్వీత = విస్తరింపజేయాలి.

## బలరామావతారం

9. ఫక్కత్కౌరవపట్టణప్రభృతయః ప్రాస్తప్రలంబాదయః
తాలాంకస్య తథావిధా విహృతయ స్తన్వంతు భద్రాణి నః ।
క్షీరం శర్కయేవ యాభి రపృథగ్భూతా ప్రభూతై ర్గుణైః
ఆకౌమారక మస్వదంత జగతే కృష్ణస్య తాః కేలయః ॥

ఫక్కత్ కౌరవపట్టణప్రభృతయః = కౌరవుల పట్టణం అయిన హస్తినాపురం మొదలైనవానిని (తనహలాయుధంతో) పట్టి బలంగా లాగడం, ప్రాస్తప్రలంబాదయః= ప్రలంబాసురుడు మొదలైనవారిని సంహరించడం, తథావిధాః = ఇంకా పలు విధాలైన అటువంటి, తాలాంకస్య విహృతయః = బలరాముని లీలలు, నః భద్రాణి తన్వంతు = మనకు శుభాలను కల్గించాలి, శర్కరయా క్షీరమ్ ఇవ = చక్కెరతో కూడిన పాలవలె, కృష్ణస్య ఆకౌమారకమ్ తాః కేలయః = శ్రీకృష్ణుని బాల్యంనుండి జరిగిన ఆ లీలలు, యాభిః అపృథగ్భూతాః = ఏ బలరాముని లీలలతో కూడినవై, ప్రభూతైః గుణైః = చాలా గొప్ప సౌశీల్యాదిగుణాలతో, జగతే అస్వదంత = లోకానికి రుచించినవో (అటువంటి బలరాముని లీలలు మనకు శుభాలను కల్గించాలి)

## శ్రీకృష్ణావతారం

10. నాథాయైవ నమః పదం భవతు నః చిత్రై శ్చరిత్రక్రమైః
భూయోభి ర్భువనాన్యమూని కుహనాగోపాయ గోపాయతే ।
కాళిందీరసికాయ కాళియఫణిస్ఫారచ్ఛటావాటికా –
రంగోత్సంగవిశంకచంక్రమధురాపర్యాయచర్యా యతే ॥

భూయోభిః = పలు విధాలైన, చిత్రైః = ఆశ్చర్యకరాలైన, చరిత్రక్రమైః = లీలావిశేషాలచేత, అమూని = ఈ, భువనాని = లోకాలను, గోపాయతే = రక్షించేవాడు, కాళిందీరసికాయ = యమునానదీ రసికుడు, కాళియఫణి = కాళియుడనే సర్పంయొక్క, స్ఫార=విశాలమై, ఛటావాటికా = పడగల సమూహాలనే, రంగ+ఉత్సంగ = నాట్య మండపం మధ్యలో, విశంకచంక్రమధురా పర్యాయచర్యాః=నిర్భరంగా, ఏ శంక లేకుండా నటనం చేయడం మొదలైన లీలలను, యతే = పొందేవాడైన, కుహనాగోపాయ నాథాయ ఏవ = గోపాలకృష్ణునిగూర్చియే, నః నమః పదం భవతు = మన నమస్కారోక్తి కావాలి.

## కల్క్యవతారం

11. భావిన్యా దశయా భవన్నిహ భవధ్వంసాయ నః కల్పతాం
కల్కీ విష్ణుయశస్సుతః కలికథాకాలుష్యకూలంకషః ।
నిశ్శేషక్షతకంటకే క్షితితలే ధారాజలౌఘైః ధ్రువం
ధర్మం కార్తయుగం ప్రరోహయతి య న్నిస్త్రింశధారాధరః ॥

భావిన్యా దశయా = ఇక సంభవించబోయే అవతారంతో, ఇహ భవన్ = దశావతార మూర్తుల సన్నిధి అయిన ఇక్కడ సత్తను పొందినవాడు, విష్ణుయశస్సుతః= విష్ణుయశస్సు అనేవానికి పుత్రుడుగా అవతరించబోయేవాడు, కలికథాకాలుష్య కూలం కషః = కలికల్మషాలను తొలగించబోయేవాడు అయిన, కల్కీ = కల్కిభగవానుడు, నః భవధ్వంసాయ = మన సంసారదుఃఖాన్ని తీర్చడంకోసం, కల్పతామ్ = సమర్థుడు కావాలి (కల్కిభగవానుని మహిమను శ్లోకంలోని ఉత్తరార్ధం వివరిస్తున్నది), యత్ నిస్త్రింశధారాధరః= ఏ కల్కి భగవానుని కత్తి అనే కాలమేఘం, నిశ్శేషక్షతకంటకే = మిగులు అనేది లేకుండా పూర్తిగా నాశనం చేయబడ్డ కంటకాలను (పావులను) కల్గినదిగా చేయబడ్డ, క్షితితలే = భూమండలంలో, ధారాజల+ఓఘైః = ఖడ్గం అంచు అనే జలప్రవాహాలతో, కార్తయుగం ధర్మం = కృతయుగధర్మాన్ని, ధ్రువం ప్రరోహయతి = నిశ్చయంగా అభివృద్ధిని పొందిస్తున్నాడో (మొలకెత్తిస్తున్నాడో) అటువంటి కల్కిభగవానుడు మన దుఃఖాన్ని తీర్చడంలో సమర్థుడు కావాలి.

12. ఇచ్ఛామీన ! విహారకచ్ఛప ! మహాపోత్రిన్ ! యదృచ్ఛాహరే !
రక్షావామన ! రోషరామ ! కరుణాకాకుత్స్థ ! హేలాహలిన్ ! ।
క్రీడావల్లవ ! కల్కవాహన ! దశాకల్పిన్నితి ప్రత్యహం
జల్పంతః పురుషాః పునంతి భువనం పుణ్యౌఘపణ్యాపణాః ॥

ఇచ్ఛామీన=స్వేచ్ఛతో మత్స్యరూపాన్ని పొందినవాడా ! విహారకచ్ఛప = క్రీడార్థంగా కూర్మరూపి అయినవాడా !, మహాపోత్రిన్ = మహావరాహమూర్తీ !, యదృచ్ఛాహరే = యాదృచ్ఛికమైన నరసింహరూపాన్ని దాల్చినవాడా !, రక్షావామన = దేవేంద్ర రక్షణార్థంగా వామనవేషాన్ని ధరించినవాడా!, రోషరామ= రోషమే రూపొందిన పరశురామా!, కరుణా కాకుత్స్థ = కరుణయే మూర్తీభవించిన శ్రీరామా!, హేలాహలిన్= లీలాబలరామ మూర్తీ!, క్రీడావల్లవ = దివ్యలీలార్థం గోపాలుడైనవాడా!, కల్కవాహన = తెల్ల గుఱ్ఱాన్ని వాహనంగా కల్గిన కల్కిభగవానుడా!, దశా + ఆకల్పిన్ = ఈవిధంగా దశావతారాలను రూపాలుగా కల భగవన్ !, ఇతి =అని ఈ విధంగా, ప్రత్యహం జల్పంతః = ప్రతిదినం నోరార



జల్పించేవారై (పలవరించేవారై), పుణ్య+ఓఘ+పణ్య+ ఆపణాః = పుణ్యసమూహాలనే సరుకులకు అంగడివంటివారైన, పురుషాః = పురుషులు, భువనం పునంతి = లోకాలను పవిత్రం చేస్తున్నారు.

## ఫలశ్రుతి

13. విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ జాతం జగన్మంగళం
దేవేశస్య దశావతారవిషయం స్తోత్రం వివక్షేత యః ।
వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరా మానసే
శుద్ధిః కాపి తనౌ దిశాసు దశసు ఖ్యాతిః శుభా జృంభతే ॥

విద్యా+ఉదన్వతి = విద్యాసముద్రుడైన, వేంకటేశ్వరకవౌ = శ్రీమద్వేంకట నాథార్యకవియందు, జాతం = ఆవిర్భవించినది (శ్రీదేశికులచే రచింపబడినది), జగన్మంగళం = లోకాలకు అన్నిటికీ మంగళాలను కల్గించేది అయిన, దేవేశస్య దశావతారవిషయం = దేవాధిదేవుని దశావతారాలనుగూర్చిన, స్తోత్రం = (ఈ) స్తోత్రాన్ని, యః వివక్షేత = ఎవడు అనుసంధించాలని కోరతాడో, తస్య వక్త్రే = అతని వాక్కులో, సరస్వతీ బహుముఖీ జృంభతే = సరస్వతి బహుముఖంగా విస్తరిస్తుంది, మానసే = మనస్సులో పరా భక్తిః = గొప్ప భక్తి వృద్ధి చెందుతుంది, తనౌ కాపి శక్తిః జృంభతే = శరీరంలో అసాధారణమైన పరిశుద్ధి ప్రకాశిస్తుంది, దిశసు దశాసు శుభా ఖ్యాతిః జృంభతే= పది దిక్కులలో గొప్ప కీర్తి వ్యాపిస్తుంది.

# శ్రీరామధ్యానశ్లోకాలు

1. ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ఆపదలను తీర్చేవాడు, అన్ని సంపదలను ఇచ్చేవాడు,లోకాలను అన్నిటిని ఆనందింపజేసేవాడైన శ్రీరామునకు మాటిమాటికి నమస్కారం.

2. రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

రామభద్రుడు, రామచంద్రుడు, పరబ్రహ్మ, రఘుకుల ప్రభువు, మనకు నాథుడు, సీతాపతి అయిన శ్రీరామునకు నమస్కారం.

**3. సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ।**
**గచ్ఛన్ మమాగ్రతో నిత్యం రామః పాతు సలక్ష్మణః ॥**

కవచాన్ని, ఖడ్గాన్ని కలవాడు, ధనుర్బాణాలను దాల్చినవాడు, యువకుడు, రక్షణ కార్యానికి సన్నద్ధుడు, లక్ష్మణునితో కూడినవాడైన శ్రీరాముడు ఎల్లప్పుడు నాకు ముందుగా వేంచేస్తూ నన్ను రక్షించాలి.

**4. అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వత శ్చ మహాబలౌ ।**
**ఆకర్ణపూర్ణధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ ॥**

గొప్ప బలాన్ని కలవారు, ఆకర్ణాంతం సంధించిన ధనుస్సును కలవారైన శ్రీరామలక్ష్మణులు నాముందు వెనుక, రెండువైపుల కూడా నన్ను రక్షించాలి.

**5. ఆర్తానా మార్తిహంతారం భీతానాం భయనాశనమ్ ।**
**ద్విషతాం కాలదండం తం రామచంద్రం నమామ్యహమ్ ॥**

ఆర్తిని పొందినవారి ఆర్తిని (దుఃఖాన్ని) తీర్చేవాడు, భయపడినవారి భయాన్ని పోగొట్టేవాడు, శత్రువులకు కాలదండం వంటివాడు, అద్వితీయుడైన ఆ రామచంద్రుని నమస్కరిస్తున్నాను.

**6. నమః కోదండహస్తాయ సంధీకృతశరాయ చ ।**
**ఖండితాఖిలదైత్యాయ రామాయాపన్నివారిణే ॥**

కోదండాన్ని చేతిలోగలవాడు, ధనుస్సులో బాణాలను ఎక్కుపెట్టినవాడు, దైత్యులను అందరినీ వధించినవాడు, ఆపదలను నివారించేవాడైన రామునకు నమస్కారం.

**7. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం**
**సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్ ।**
**ఆజానుబాహు మరవింద దళాయతాక్షం**
**రామం నిశాచరవినాశకరం నమామి ॥**

గొప్ప రఘువంశంలో జన్మించినవాడు, దశరథుని పుత్రుడు, అంతులేని మహిమను కలవాడు, సీతకు వల్లభుడు, రఘుకులాన్ని ప్రకాశింపజేసే రత్న దీపం వంటివాడు, ఆజానుబాహువు, పద్మాలవంటి కన్నులను కలవాడు, రాక్షసులను నశింపజేసినవాడైన శ్రీరామునకు నమస్కరిస్తున్నాను.



**8. వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే**
**మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।**
**అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం**
**వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలం ॥**

కల్పవృక్షం క్రింద బంగారుమహామంటపంలో పుష్పకవిమానం నడుమ మణులతో చేయబడిన ఆసనంపై వీరాసనంలో సీతాదేవితోపాటు కలసి వేంచేసియున్నవాడు, ఆంజనేయస్వామి గ్రంథాన్ని చదువుతూ ఉండగా, దానిలోని గొప్పతత్త్వాన్ని మునులకు వివరించేవాడు, భరతుడు మొదలైన వారితో కలసి ఉన్నవాడు, నీలవర్ణాన్ని కలవాడైన శ్రీరాముని భజిస్తున్నాను.

**9. శ్రీరామచంద్రః శ్రితపారిజాతః సమస్తకల్యాణ గుణాభిరామః ।**
**సీతాముఖాంభోరుహ చంచరీకః నిరంతరం మంగళ మాతనోతు ॥**

భక్తులకు కల్పవృక్షంవంటివాడు, సమస్తకల్యాణగుణాలతో మనోహరుడు, సీతాదేవి ముఖమనే పద్మంలో సదా చేరి ఉండే తుమ్మెదవంటివాడైన శ్రీరామచంద్రుడు మనకు నిత్యం శుభాలను విస్తరింపజేయాలి.

**10. శంపామధ్యస్ఫురన్నీల తోయదద్యుతివిగ్రహమ్ ।**
**సీతయాఽలింగితం రామం కలయేఽభీష్టసిద్ధయే ॥**

మధ్యలో మెఱపుతీగ ప్రకాశించే నల్లని మేఘంవలె కాంతితో కూడిన రూపాన్ని కలవాడు, సీతాదేవిచే ఆలింగనం చేసికోబడినవాడైన శ్రీరాముని నా అభీష్టసిద్ధికోసం ధ్యానిస్తున్నాను.

**11. ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।**
**పౌరుషేచ అప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్ ॥**

దశరథపుత్రుడైన శ్రీరాముడు – ధర్మాత్ముడు, సత్యవాక్య పరిపాలకుడు అయితే, పౌరుషంలో సాటిలేని వాడైతే, ఓ బాణమా! నీవు ఇంద్రజిత్తును వధించు.

(లక్ష్మణుడు ఈ శ్లోకాన్నే మంత్రంగా పఠించి, ఇంద్రజిత్తును వధించాడు. దీనిని పెద్దల ద్వారా ఉపదేశంగా పొంది ప్రతిదినం చదువుకొంటే అభీష్టసిద్ధి కల్గుతుంది.)

**12. శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే ।**
**సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే! ॥**

అందమైన ముఖాన్ని కలిగిన నా మనస్సును రంజింపజేసే పార్వతీ! శ్రీరామ రామ రామ అనే రామనామాన్నే నేను ఇష్టంగా జపిస్తున్నాను. ఆ నామం భగవానుని వేయి నామాలకు సాటివచ్చే నామం.

# శ్రీరామమంగళాశాసనమ్

( ఈ స్తుతిని ఆరాధన చివరలో చెప్పుకోవడం పెద్దల అలవాటు. దీనిని వరవర మునులు రచించారని పెద్దలంటారు.)

**1. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే**
**చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥**

కోసలదేశానికి ప్రభువు, గొప్ప కల్యాణగుణాలను కలవాడు, దశరథచక్రవర్తి కుమారుడు, సార్వభౌముడైన శ్రీరామునకు మంగళం.

**2. వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే ।**
**పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥**

వేదాలచే, వేదాంతాలచే తెలియబడేవాడు, మేఘంవలె నీలవర్ణంలోని రూపాన్ని కలవాడు, పావనాలైన కల్యాణగుణాలను కలవాడు, మహనీయులచే కీర్తింపబడేవాడైన శ్రీరామునకు మంగళం.

**3. విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః ।**
**భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్ ॥**

విశ్వామిత్రుని తన హృదయంలో కలవాడు, విశ్వామిత్రుని హృదయంలో వేంచేసి ఉండేవాడు, మిథిలానగర ప్రభువైన జనకుని పుణ్యఫలరూపుడు, దివ్యమంగళ విగ్రహుడైన శ్రీరామునకు మంగళం.

**4. పితృభక్తాయ సతతం భ్రాతృభిః సహ సీతయా ।**
**నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్ ॥**

పితృభక్తి పరాయణుడు, సోదరులతో, సీతతో పాటు కలసి ఉండి సమస్తలోకాలను రంజింపజేసినవాడైన రామభద్రునకు మంగళం.



**5. త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే ।**
**సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్ ॥**

సాకేతవాసాన్ని విడచిపెట్టి, చిత్రకూటంలో విహరించినవాడు, దండకారణ్యం లోని మునులందఱిచే సేవింపబడినవాడు, ఒంటరిగా ఖరదూషణాది పధ్నాలుగు వేలమంది రాక్షసులను అవలీలగా సంహరించిన ధీరోదాత్తుడైన శ్రీరామునకు మంగళం.

**6. సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే ।**
**సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్ ॥**

ధనుర్బాణాలను ధరించినవాడు, లక్ష్మణునితో, సీతాదేవితో కలసి సదాభక్తితో సేవించదగిన వాడు, నా స్వామి అయిన శ్రీరామునకు మంగళం.

**7. దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే ।**
**గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్ ॥**

దండకారణ్యంలో నివసించినవాడు, దేవతలకు శత్రువులైన రాక్షసుల సంహరించినవాడు, భక్తుడైన జటాయువునకు మోక్షాన్ని ప్రసాదించినవాడైన శ్రీరామునకు మంగళం.

**8. సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే ।**
**సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్ ॥**

శబరి సమర్పించిన కందమూలాలను సాదరంగా గ్రహించినవాడు, సౌలభ్య గుణంతో నిండినవాడు, సత్త్వగుణోద్రేకాన్ని కలవాడైన శ్రీరామునకు మంగళం.

**9. హనుమత్ సమవేతాయ హరిశాభీష్టదాయినే ।**
**వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్ ॥**

హనుమంతుతో కూడినవాడు, సుగ్రీవుని అభీష్టాన్ని అనుగ్రహించినవాడు, వాలిని సంహరించినవాడు, మహాధీయుడైన శ్రీరామునకు మంగళం.

**10. శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే ।**
**జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్ ॥**

కల్యాణగుణాలను కలవాడు, రఘుకులంలోని గొప్పవీరుడు, సేతువును కట్టి సముద్రాన్ని దాటినవాడు, రాక్షసరాజైన రావణుని వధించినవాడు, రణధీరుడైన శ్రీరామునకు మంగళం.

**11. ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా ।**
**రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్ ॥**

దివ్యమైన అయోధ్యానగరాన్ని చేరి, సీతతో కలసి పట్టాభిషిక్తుడైనవాడు, ప్రభువు లందఱికి ప్రభువైన రామభద్రునకు మంగళమ్ ॥

**12. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।**
**సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥**

# నక్షత్రమాలికా

( ఈ స్తోత్రాన్ని శ్రీవరవరమునుల మనుమలు జీయర్ నాయనార్ అనే ఆచార్యులు రచించారు. ఇందులో నమ్మాళ్వార్ల వైభవం కీర్తింపబడింది. అశ్వని మూలలు రేవతి వరకు గల 27 నక్షత్రాల పేర్లు వరుసగా ఒక్కొక్క శ్లోకంలో కూర్పబడడం గమనించదగిన విషయం. దీనిని ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది.)

## గ్రంథకర్తప్రార్థనాశ్లోకము

## (తనియన్)

**అస్మాసు వత్సలతయా కృపయా చ భూయః**
**స్వేచ్ఛావతీర్ణ మివ సౌమ్యవరం మునీంద్రమ్ ।**
**ఆచార్యపౌత్ర మభిరామవరాభిధానం**
**అస్మద్గురుం పరమకారుణికం నమామి ॥**

మాయందు వాత్సల్యముతో కృపతో మరల శ్రీమణవాళమహామునులే అవతరించిరా? అనునట్లున్నవారు, ఆ మణవాళమహామునుల పౌత్రులు, పరమ కారుణికులు, అభిరామవరులను పేరును కల్గినవారగు మా ఆచార్యులను నమస్కరించు చున్నాను.



**1. శ్రీమాన్ పరాంకుశముని ర్దీయాత్ యత్ జ్ఞానముద్రయా ।**
**నేంద్రియాశ్వయుజో నృణాం నిత్యం విషయవీథయః ॥**

నమ్మాళ్వార్ల జ్ఞానముద్రవలన జనులకు నిజమైన స్వరూపజ్ఞానము కలిగెను. అందువలన వారి ఇంద్రియములు అను అశ్వములు ఎన్నటికిని లౌకికవిషయములు అను వీథులలో సంచరింపవు. అట్టి జ్ఞానవైభవమును కల్గిన నమ్మాళ్వార్లు నిత్యము సర్వోత్కర్షతో వెలుగొందుదురుగాక!

**2. యదురసి భరణీయా స్రక్ వికసితవకుళా నద్ధా ।**
**స జయతి మహిమా నాథో మురరిపుపదసక్తో నః ॥**

నమ్మాళ్వార్ల హృదయమున అలంకరింపబడిన మాల వికసించిన వకుళ పుష్పములతో కూర్చబడినది. ఎల్లప్పుడును భగవానుని పాదారవిందములను ధ్యానించు వారు, మహిమకల్గినవారు, మాకు నాథులగు నమ్మాళ్వార్లు సర్వోత్కర్షతో ప్రకాశించు చున్నారు.

**3. సంతానసంతాంఘ్రినళినయుగ్మే కర్తా లోకార్తికబలనానామ్ ।**
**భద్రాయ ద్రావిడనిగమానాం ద్రష్టా పుష్టాయ వకుళభృత్ స్యాత్ ॥**

భగవానుని పాదారవింద యుగమును ఎల్లప్పుడు నమస్కరించువారును, లోకము లోని జనుల ఆర్తిని హరించువారును, ద్రావిడాగమద్రష్టలును అగు నమ్మాళ్వార్లు మన యోగక్షేమములను రక్షింతురుగాక!

**4. స్యాదేవ సా మే ఫణితి శ్శఠారేః యయోదితోచ్చై స్సరణి ర్జనానామ్ ।**
**ఆరోహిణీ నాప్యవరోహిణీ హి వేదోదితా తు ద్వయ మభ్యుపైతి ॥**

తమప్రబంధములలో ఆళ్వార్లు ప్రపత్తిమార్గము జనులు అందఱికిని ఆచరణ యోగ్యమని ప్రబోధించిరి. ఆ మార్గమున భగవానుని ఆశ్రయించినవారికి భగవత్ప్రాప్తి సిద్ధము. ఆ పిమ్మట వారు తిరిగి ఈ లోకమున జన్మింపవలసిన పని లేదు. సంస్కృత వేదము సత్త్వరజస్తమోగుణములను కల్గిన జనులందఱిని దృష్టిలో నుంచుకొనిన దగుటచే అధికారానుగుణముగా ముముక్షువులను గూర్చి, బుభుక్షువులను గూర్చి, వారు ఆచరింప వలసిన విధానములను గూర్చి పల్కినది. ద్రావిడవేదము మాత్రము ముముక్షువులగు ఉత్తమాధికారులనుగూర్చి పల్కుటచే సారతరము. అట్టి ఆళ్వార్ల ప్రపత్తిమార్గము నాకగును గాక!

5. తిలక మాహ న కాచిదపి శ్రుతౌ త్రిజగతా మృగశీర్షసముత్థితా ।
స్ఫుటతరం వకుళాభరణీయవాక్ పురుష మాది మశేషపదై రపి ॥

వేదములోని కర్మకాండమున సర్వేశ్వరుని గూర్చిన ప్రసక్తియే లేదు. కాని, నమ్మాళ్వార్ల శ్రీసూక్తి ఆదిపురుషుడగు భగవానునిగూర్చి మిక్కిలి విస్తృతముగా పలు పదములతో వర్ణించుచున్నది.

6. పిత్రాది స్సకలవిధోఽపి బంధువర్గో యస్యాసీత్ సరసిజవాసినీసహాయః।
ఆవిఃస్యుః ఘనకరుణారసావసేకైః ఆర్ద్రా మే వకుళభృతః కటాక్షపాతాః ॥

తనకు తండ్రి, తల్లి మొదలగు బంధువర్గమంతయు శ్రియఃపతి అగు భగవానుడేనని తలచిన నమ్మాళ్వార్లు కరుణారసముతో చల్లనివగు తమ చూపులతో నన్ను అనుగ్రహింతురు గాక!

7. తా మాశ్రయామి కరుణాం వకుళాభిరామాం ।
యాఽసౌ పునర్వసుమతీ వలయేఽవతీర్ణా ।
ప్రజ్ఞాదృశోన్మిషితయా ప్రథితానుభావా
జ్యోతిః పరం యదనిదం తదిదం చకార ॥

నమ్మాళ్వార్లు అను రూపమున లోకమున అవతరించిన కరుణాదేవి గొప్ప ప్రసిద్ధిని పొందినదై, జ్ఞాననేత్రముద్వారా ఇదమిత్థమని దర్శించుటకు సాధ్యముకాని పరంజ్యోతిస్స్వరూపమును ఇట్టిదని అందఱును చూచుటకు వీలగునట్లు చేసెను. అట్టి కరుణామూర్తిని నేను ఆశ్రయింతును.

8. రచితవతి రమాయా నాయకస్యాంఘ్రి పుష్యత్ –
ప్రణయరససుధాబ్ధిస్రోతసి స్వైరగాహమ్ ।
ప్రభవతి కలిఘర్మప్రావృషేణ్యాంబువాహే
వకుళధరమునీంద్రే తాపవార్తా కథం నః ॥

శ్రియఃపతియొక్క పాదములయందు దినదినాభివృద్ధిని చెందు భక్తిరసము అను అమృతసముద్రమున యథేచ్ఛగా అవగాహనమును చేసినవారు, వర్షకాల మేఘము వలె చల్లగా (శయను) వర్షించువారగు నమ్మాళ్వార్లు అవతరించిన పిదప మనకు తాపము కల్గుటకు అవకాశము లేదు.



9. నమజ్జనస్య చిత్తభిత్తిభక్తిచిత్రతూలికా ।
భవాహివీర్యభంజనే నరేంద్రమంత్రయంత్రణా ।
ప్రపన్నలోకకైరవప్రసన్నచారుచంద్రికా
శఠారిహస్తముద్రికా హఠా ద్ధునోతు మే తమః ॥

తమకు నమస్కరించేవారి మనస్సులలో భక్తి అనే చిత్రాన్ని లిఖించే చిత్రలేఖిని వంటిది, సంసారమనే సర్పంయొక్క విషాన్ని పోగొట్టడంకోసం విషవైద్యుడు చేసే మంత్రప్రయోగయంత్రం వంటిది, ప్రపన్నుల మనస్సులకు ఆనందాన్ని కల్గించే అందమైన చంద్రికవంటిది అయిన నమ్మాళ్వార్ల ఉపదేశముద్ర నా అజ్ఞానాన్ని తొలగించాలి.

10. మనఃస్ఫటికదర్పణప్రతిఫలత్పరబ్రహ్మణః
ప్రదర్శన మివాచరన్ ప్రథితబోధముద్రాంకితః ।
సదా మభయశంసితా భవభయాభితప్తాత్మనామ్
అఘాని శమయేత నః శఠరిపో రవామః కరః ॥

స్ఫటికదర్పణమువలె స్వచ్ఛమైన తమ మనస్సులో ప్రతిఫలించు భగవానుని దివ్య మంగళరూపమును భక్తులకు చూపించుచున్నట్లు, జ్ఞానముద్రతో కూడుకొని, హృదయమును తాకుచున్న ఆళ్వార్ల హస్తము ప్రకాశించుచున్నది. సంసారభయముచే మిక్కిలి పరితపించు భక్తులకు అభయప్రదానమును చేయగల్గిన ఆ హస్తము మన పాపములను పోగొట్టును గాక!

11. రమయతు శఠశత్రు రత్యున్నతాచారయుక్తైర్జనైః
అవనతపదపద్మయుగ్మోఽనుకంపామృతాంభోనిధిః ।
బహువిధకృతపూర్వఫల్గున్యగాచారచింతాకులం
హృదయ మసదృశాత్మపాదారవిందానుషంగా న్మమ ॥

గొప్ప అనుష్ఠానమును కల్గిన మహనీయులచే నమస్కరింపబడు పాదపద్మములను కల్గినవారు, దయాసముద్రులు అగు నమ్మాళ్వార్లు పూర్వజన్మలో చేసిన పలువిధములైన పాపముల వలన మిక్కిలి కలతజెందిన నా మనస్సును సాటిలేని తమ పాదములు అను అరవిందములతో సంబంధమును కల్గించుట ద్వారా రంజిల్లచేయుదురు గాక !

**12. మగ్నం మానస మా స్మ భూ శ్శఠరిపో రవ్యాజసిద్ధా కృపా**
**నౌకా కాచన నావికోఽపి స పున స్సంతారకగ్రామణీః ।**
**ఏతేనోత్తరఫల్గుణీ రసపరిక్లిష్టోపభోగోర్మికం**
**దుఃఖావర్త దురంతపారగమనం సంసారవారాకరమ్ ॥**

ఓ మనసా! నీవు సంసారసముద్రమున మునిగి నశింపవలసిన పనిలేదు. నమ్మాళ్వార్ల సహజమైన కృప ఒక గొప్ప నావ. ఆ నావను నడపు నావిక శ్రేష్ఠుడు కూడా ఆళ్వార్లే. అత్యల్పసుఖమును ఇచ్చు లౌకికభోగములు అను కెరటములతో కూడినది, దుఃఖములు అను సుడులతో కూడినది, అంతము లేనిదగు సంసార సముద్రమును నీవు ఆళ్వార్లు అను నావికుని సహాయముచే దాటగలవు. చింతింపకుము.

**13. రత్నదీపికాయమాన హస్తముద్రికాకృత త్రయీగిరీంద్ర –**
**కందరాంతరాళ గాఢరూఢరూఢిమన్నిధాన సూచనేన ।**
**ద్రావిడాగమోపగీతి మూలసేకశతవీత నిద్రపత్ర –**
**దివ్యతింత్రిణీసమీపగేన నాథవా నహం పరాంకుశేన ॥**

రత్నదీపికవలె తోచు తమహస్తముద్రతో నమ్మాళ్వార్ల వేదములు అను గొప్ప పర్వతము యొక్క గుహలో లోలోపల గుప్తముగా, సామాన్యులకు కనుపింప కుండనున్న నిధి అగు సర్వేశ్వరుని అందఱకు కన్పించునట్లు చేయుచున్నారు. వారి దివ్యప్రబంధముల గానమను తీర్థసేచనము వలన వారు నివసించు తింత్రిణీవృక్షము చల్లనిది, నిదురింపని ఆకులను కల్గినది అయినది. ఇట్టి ఆళ్వార్లను నేను ఆశ్రయించి, దిక్కును కల్గిన వాడనైతిని.

**14. నత్యా న త్యాగకారీ క్షణ మపి చిదచిత్త్రాయకామేయకామే –**
**ఛందశ్ఛందస్వరూపే మహసి కమలయా భాసమానేఽసమానే ।**
**శ్రేయ శ్శ్రేయస్విసంఘైః పరిచయసురభిః కైసరాణాం సరాణాం**
**పాతాత్ పాతా దివాబ్ధౌ శఠరిపు రిహ నో వీక్షణేన క్షణేన ॥**

చేతనాచేతనరూపమైన జగత్తును రక్షించుటయందు అనిర్వచనీయమైన అభినివేశమును కలవారును, వేదములచే ప్రతిపాద్యులును, ఎల్లప్పుడు లక్ష్మీదేవితో ప్రకాశించువారును, అసమానజ్యోతిఃస్వరూపుడగు భగవానునకు నిరతము నమస్క రించువారు, భగవానుని నిత్య కైంకర్యమను సంపదను కల్గియున్న భక్తులకు ప్రాప్యులును, వకుళమాళికలచే అలంకరింపబడుటచే ఆ పూల సువాసనను కల్గినవారును అగు



నమ్మాళ్వార్లు మనలను క్షణకాలము వీక్షించుట ద్వారా సంసారసముద్రమున పడకుండ రక్షింతురుగాక!

**15. న ప్రపత్తివర్త్మనః ప్రవర్తనాపదాన వాసనానుసారి**
**నవ్యపేత జలాశయాన్వయం కథం సమం సరోజమ్ ।**
**స్వాతికామియోగిబృంద చిత్తపద్మబద్ధ సౌహృదానురక్త –**
**రూపయోః శఠారి పాదయో ర్యుగేన సన్నతార్తిభంజనేన ॥**

ఆశ్రితుల దుఃఖమును పోగొట్టునవి, తమపట్ల గొప్ప భక్తిని కల యోగుల హృదయ పద్మములతో స్నేహమును కల్గినవి, అట్లు ఆ స్నేహమును కల్గియుండుటను సూచించు ఎఱ్ఱని రంగును కల్గియున్నవి అగు నమ్మాళ్వార్ల శ్రీపాదములతో – ప్రపత్తిమార్గమును అనుసరించుట అను విషయసంస్కారమును లేశమైనను లేనివి, ఎల్లప్పుడు జడా శయములో (సరస్సుతో) సంబంధమును కల్గిన వగు పద్మములు ఎట్లు సమానము లగును? కానేఱవు కదా!

**16. నత్వా యాం కుసుమాయుధేషుధి రుచివ్యాఘాత మాతన్వతీం**
**శేముష్యా మహతా మహోయి తరుణీజంఘాసు జంఘాలతా ।**
**విస్తీర్ణచ్ఛవిశాఖయా శఠజితో వృత్తానుపూర్వీజుషా**
**జంఘాకల్పతరుశ్రియా సురభితం చింతావనం మామకమ్ ॥**

మన్మథుని అంబులపొది కాంతికి భంగమును కల్గించునట్టి ఆళ్వార్ల జంఘల యొక్క సౌందర్యమును దర్శించిన మహనీయులకు లౌకికమైన, అల్పమైన తరుణుల జంఘాసౌందర్యముపట్ల ఆసక్తి కలుగదు. ఆ జంఘలు గుండ్రనివై, విస్తరించిన కాంతులనెడి శాఖలను కల్గినవైన కల్పతరువులవలె శోభిల్లుచున్నవి. ఆ జంఘాకల్ప తరువులు నా ఆలోచనలు అను వనమును సురభితమును చేయుగాక! అనగా, సకలార్థములను అనుగ్రహించును గాక! అని తాత్పర్యము.

**17. కనదయవలోల శోభావదాతాపగాస్రోతస –**
**స్సముదితగురుబుద్బుదాకార సందేహసందాయినోః ।**
**కకుదధిగతమిత్రభావం స్వభావా ద్యుగం జానునోః**
**మును హృది శఠవైరినామ్నో మునీశస్య సందీవ్యతు ॥**

మిక్కిలి సుందరములగు ఆళ్వార్ల దివ్యావయవములలో తళతళమని మెఱయు లావణ్యము తెల్లని నదీప్రవాహమువలె ఉన్నది. ఆ ప్రవాహములో పుట్టిన రెండు పెద్ద

నీటి బుడగలా ఇవి! అను సందేహమును మోకాళ్లు కల్గించుచున్నవి. సహజముగా ఎద్దుమూపురముల వలెనున్న ఆ మోకాళ్ల జంట నా హృదయమున ప్రకాశించును గాక!

**18. తులాసరణిసీమని ప్రథితరూపయా హస్తినాం**
**కరేణ కరభేణ వా కదలికాప్రకాండేన వా ।**
**తథోపరి చ పశ్యతాం నయనబంధనజ్యేష్ఠయా**
**చమత్కృతిమతీ మతిః శఠరిపూరులక్ష్మ్యా మమ ॥**

ఏనుగుల తొండముతో, కరభముతో, అరటిబోదెలతో ఉపమించుట యందు తగిన ప్రసిద్ధిని పొందినది, చూపరుల చూపులను ఆకట్టుకొనుటలో మొదటిది అగు నమ్మాళ్వార్ల ఊరుయుగము నా మనస్సునకు అనిర్వచనీయమైన చమత్కారమును కల్గించినది.

**19. మహఃప్రరోహమంజరీ మనోజ్ఞరత్నమేఖలా**
**కలాపపుష్పితాకటీతటీపటీ శఠద్విషః ।**
**ఉరఃస్రవత్ప్రభాఝురీ నిపాతనిమ్ననాభికాః**
**వటోత్థఫేనమండలీ వితర్కమూల మేవ నః ॥**

నమ్మాళ్వార్ల తేజః పుంజములతో ఇనుమడించిన అందమును కల్గిన మణిమేఖలా కలాపముచే పూచినట్లున్న కటిప్రదేశమున అలంకరింపబడిన శ్వేతవస్త్రము, ఆళ్వార్ల వక్షస్థలమునుండి ప్రవహించిన కాంతిప్రవాహము వేగముగా క్రిందకు పడుటచే ఏర్పడిన నాభి అను పల్లపు ప్రదేశమునుండి ఉద్భవించిన నుఱుగు సమూహమా! అనునట్లు శోభిల్లుచున్నది.

**20. నయనసుభగనాభీ ముద్దిశంతీ శఠారేః**
**సర ఇతి పరిభాషా ఢౌకతే సార్థకత్వమ్ ।**
**సతత మితరథా నః సంహతా నేత్రమీనాః**
**కథ మిహ విహరేయుః కౌతుకోద్రేకయుక్తాః ॥**

నేత్రసుభగమైన ఆళ్వార్ల నాభిని సరస్సు అని వర్ణించుట సముచితము. అర్థవంతము. అట్లు నాభి సరస్సుకానిచో మన కన్నులను చేపలు ఆనాభియందు మిక్కిలి ఆసక్తితో ఎల్లప్పుడు ఎట్లు విహరించును? కావున ఆళ్వార్ల నాభి ఒక సరస్సు.



**21. తాం మధ్యదేశసుషమా మవలోకయామి**
**రోమావలీత్రివలికారుచిరాం శఠారేః ।**
**రేఖోత్తరా యదుపమా మధికాభిలాషా**
**ఢౌకేత వా యది న వా వటపత్రశోభా ॥**

రేఖలచే గొప్పదగు మఱ్ఱి ఆకు త్రివళులతో, రోమరాజితో శోభిల్లు ఆళ్వార్ల నడుముతో తులతూగవలెనను ఆశ కల్గినదైనను, ఆ ఆశ నెఱవేఱలేదు. అట్టి అసదృశమైన నడుము యొక్క కాంతిని నేను కన్నులార దర్శించి, ధన్యుడనైతిని.

**22. భాసా న వ్యతిభిదురీ భవంతి భృంగా**
**హారస్థాదురసి హరిన్మణేః శఠారేః ।**
**ఆరూఢా వకుళమయీం స్రజం సుగంధిం**
**శబ్దేన శ్రవణసుఖేన యాంతి భేదమ్ ॥**

ఆళ్వార్ల హృదయప్రదేశమున అలంకరింపబడినది, సుగంధమును కల్గినదగు వకుళమాలికయందు చేరియున్న తుమ్మెదల సమూహము వారి వక్షఃస్థలమున అలంకరింప బడిన ముత్యాలహారములోని మరకతమణివలె శోభిల్లుచున్నది. రెండిటికి మధ్యగల భేదమేమన – మరతకమణి మధురముగా ధ్వనింపలేదు. కాని తుమ్మెదలు శ్రవణ సుభగముగా ధ్వనించుచున్నవి.

**23. దమవతః కురుతే మదనోద్ధతాన్**
**సుఘటయత్యబుధాన్ బుధనిష్ఠయా ।**
**ప్రథితముద్ర మనిద్రసరోరుహ –**
**ప్రణయి పాణితలం శఠజిన్మునేః ॥**

ప్రసిద్ధమైన జ్ఞానముద్రను కల్గినది, వికసించిన తామరలతో స్నేహమును కల్గినదగు నమ్మాళ్వార్ల శ్రీహస్తము మదనతాపమును పొందినవారికి ఆతాపమును తీర్చి, వారిని నిగ్రహము కల్గినవారినిగా చేయును. వివేకము లేనివారికి వివేకమును కల్గించును. జ్ఞానముద్రను కల్గిన ఆళ్వార్ల శ్రీహస్తమును దర్శించిన వారికి శమదమాదిగుణసంపద, జ్ఞానసంపదయు సిద్ధించును.

**24. నేహ సంసరణరోగసంహృతిః జాయతే శతభిషక్చికిత్సయా ।**
**అంతరేణ శఠవైరికంధరాలంబమానవకుళస్రజాం రజః ॥**

నమ్మాళ్వార్ల కంఠదేశమున వ్రేలాడుచున్న వకుళమాలికలోని పూల పుప్పొడితో తప్ప, నూఱుమంది వైద్యులు చికిత్సచేసినను ఈ లోకమున సంసారమను వ్యాధి నయము కాదు.

**25. జన్మధ్వంసం దిశతి జనానాం వక్త్రం దీప్రోష్ఠపదమనోజ్ఞమ్ ।**
**మందస్మేరం మధురకటాక్షం సుభ్రూరేఖం సుభగకపోలమ్ ॥**

ఎఱ్ఱగా ప్రకాశించు అధరమును కల్గియుండుటచే మనస్సును ఆకట్టుకొనునది, మందహాసముతో, తీయని చూపులతో కూడినది, చక్కని కనుబొమ్మలను, అందమైన చెక్కిళ్లను కల్గినదగు ఆళ్వార్ల ముఖము జనులకు సంసారనాశనమును గూర్చి తెలుపు చున్నది. అనగా – ముక్తి సామ్రాజ్యమును ప్రసాదించుచున్నది.

**26. లసతి హి భజతాం భద్రోత్తరపదకరుణారూఢమ్ ।**
**శఠరిపుమకుటం భాసా పరిహృతదురితధ్వాంతమ్ ॥**

భక్తులకు ఉన్నతపదమును అనుగ్రహించుటకై తలపై నున్నది, తన కాంతితో పాపములను చీకటిని పోగొట్టునది అగు ఆళ్వార్ల కిరీటము మిక్కిలి ప్రకాశించుచున్నది కదా!

**27. అంతరేణ శఠారాతిం క స్సంసారేఽవతీహ నః ।**
**తదహం హృదయే నిత్యం నిదధే తద్వపుః శ్రియమ్ ॥**

ఈ సంసారము నుండి మలను రక్షింపగల్గిన వారు నమ్మాళ్వార్లు తప్ప వేరెవ్వరు ఉన్నారు? కావున ఆ ఆళ్వార్ల దివ్యదేహ సౌందర్యమును నేను నిత్యము మనస్సున ధ్యానింతును.

**28. వాచికీ వరివస్యా మే తారకామాలికాత్మికా ।**
**పరాంకుశపదాబ్జేషు పరిష్కారవతీ భవేత్ ॥**

నక్షత్ర మాలికాస్తుతిరూపమైన ఈ వాచికకైంకర్యం నమ్మాళ్వార్ల పాదపద్మాలలో అలంకారమగుగాక!

